# ఆత్మయొక్క సేవ.

## పీఠిక.

ఈచిన్నగ్రంథమునందు విచారించబడిన గొప్పసంగతిన్ని
చెప్పవలసినదంతయు చెప్పబడియున్నదని చెప్పఁగొనలేము. గాని
తిరిక్తముగా గ్రంథబాహుళ్యముగా వ్రాయుటకంటె సంక్షేపము
గా వ్రాయుటచే నీపరిశుద్ధాత్మను గురించినబోధ చక్కగ బోధపడ్త
చ్చునను నమ్మకముతో నీగ్రంథకర్త దీనిని వ్రాయదొడంగియున్నాడు.
ఎందుకనిన మితజీవులైనవారు సర్వవ్యాపకత్వముకంటె సమష్టిమమును
బాగుగ గ్రహింతురు. కాబట్టి ఈగ్రంథమునందలి సంగతి మహామర్మ
మైనదైనను పరిశుద్ధాత్మయొక్క నిత్యసేవనుగురించి దీనియందు ఆలో
చించక ఆయన తత్కాలపు సేవనుగురించి మాత్రమే ఆలోచించుటచే
త దీనిని సులభపరుచుటకు ప్రయత్నించియున్నాము. క్రీస్తుయొక్క
అవతారమునకు పూర్వమందు ఈఆత్మ ఏమిచేసెనో ఇకమీదట క్రీస్తు
యొక్క రెండవరాకడతరువాత ఏమిచేయవచ్చునో అనుఈసంగతులు
ఇందు ప్రశంసింపబడియుండలేదు. అయితే సహాయకుడుఅనగా పరిశు
ద్ధాత్మ ఇప్పుడు సంఘమునందున్నాడను గొప్పసత్యమును స్పష్టముగా
తెలియపరుచుటకున్ను, మనము ఆత్మయొక్క నిర్వాహకత్వమందు జీ
వించుచున్నామనిన్ని ఇట్టి ఏర్పాటువల్ల సంఘమునకున్ను లోకమునకు
న్ను చెప్ప నలవికాని ఆశీర్వాదములు సమకూర్చబడి యున్నవనిన్ని
చూపించుటకు ప్రయత్నించియున్నాము. ఇందువల్ల క్రీస్తుయొక్క సేవ
నగా ఒకానొకమితమైన కాలమందు ఆయనజరిగించినపని అని

ర్వాహకత్వము అంతమువరకు ఆసహాయకునియొక్క పనిని గురించి
ఇది తెలుపును గనుక ఈపుస్తకమునకు "ఆత్మయొక్క సేవ" అని పేరు
పెట్టియున్నాము.

ఇది మనము శ్రద్ధతో చదువుటకు ఎంతో తగినైన సంగతియై
కాబట్టి దీని చదువబూనుకొనువారు ఈఆత్మనుగురించి ఆత్మ
వలెనని వేడుకొనుటకంటె యెక్కువయుక్తమైన ప్రార్థన మరి
కలదా? ఈపుస్తకమునందు అనేకలోపములుండవచ్చునని బా
వాడనై దీనినిప్పుడు అదిఎవరిని గురించి చెప్పుచున్నదో త్రి
యందలి ఆమూడవ దైవాంశయొక్క ఉపయోగమునకు
శీర్వాదమునకున్ను అప్పగించుచున్నాను.

ఎ. జ. గా.

# అవతారిక

ఈగ్రంథము దేనినిమిత్తము వ్రాయబడియున్నదో అట్టి అనిశేషమైన సంగతినిగురించి ఈకడపటి దినములయందు ఎంతోమంది విచారించునట్లు ప్రేరేపించబడుట ఆశ్చర్యకరమైయున్నది. నిస్సందేహముగా సంఘముయొక్క మనస్సు బోధించబడుచున్నది. మరియు ఆదివ్యమైన సహాయకునియొక్క నివాసమునున్ను, విచారణనున్ను, సహాయపడడమునున్ను గురుతుపట్టుటకు సంఘముయొక్క హృదయము సిద్ధపరచబడుచున్నది. సంఘచరిత్ర అంతటిలో ఈవిషయమునందు ఎన్నడును ఇప్పటికంటె మించియుండలేదు మరియు తనకున్ను లోకమునకున్ను చేయబడిన మహాగొప్పవాగ్దానముతో నిండినదై యున్నది.

ఈసంగతిని గురించి వ్రాయబడిన ప్రతిపుస్తకమునున్ను పరిశుద్ధాత్మ జీవితమునుగురించిన్ని ఆయనపనిని గురించిన్ని ఒకొక్కకొత్తవెలుగు ఇచ్చుచునదై యున్నది. కాని నాయొక్క అత్యంత ప్రియస్నేహితుడగు డాక్టర్ గార్డన్ దొరగారు వ్రాసిన ఈగ్రంథమువలె నిర్మలమైనట్టియు, సత్యమైనట్టియు, దేవుని వాక్యానుగుణ్యమైనట్టియు, ఆత్మభావమైనట్టిగుణ గ్రంథము మరియొకటిచూచిన జ్ఞాపకము నాకులేదు. ఈఆత్మయొక్క మూర్తికరణము, సంపన్నత, విచారణ వీటినిగురించి వ్రాయబడిన అధ్యాయములు కేవలముక్రొత్తవిగానున్ను సహాయకరముగానున్ను కనబడుచున్నవి అయినను పుస్తకమంతా మంచిదిగానున్ను ప్రార్థనపూర్వకముగా చదువదగినదిగానున్ను ఉన్నది. దేవుని సేవకులమనసుయొక్కయు ఆత్మయొక్కయు నిర్మాణములోకి ఇట్టి సత్యములు మాత్రమే ప్రవేశించనిమ్ము అప్పుడు క్రైస్తవసభలయందు పవిత్రమైనట్టియు నిష్కళంకమైనట్టియు మతము ఉద్భవించును, మరియు ఈయుగము అంతమునందంతట వ్యాపించు పెంతెకోస్తు [illegible] ముగించునట్లు వీటిద్వారా లోకమునందంతట అట్టిఆశ్చర్యమైన ఫలములుకలుగును ఇదిన్ని దేవునిఉద్దేశము

లలో నుండెననుటకు అనేక గురుతులు కలవు. మన కాలముయొక్క గొప్ప అవసరములనున్ను ఆశలనున్ను తీర్చగలది మరియొకటి లేదు.

క్రీస్తుమతము మూడు బలమైన ప్రవాహములతో ఆవరించబడియున్నట్లున్నది. ఇవి దీనిని సరియైన మార్గములోనుంచి తప్పిపోజేయుటకు వంచనతో పనిచేయును. అవియేవనగా, నాస్తికమతము అనగా అమానుషమైనది లేక దేవతాసంబంధమైన దేదియు లేదని చెప్పి, ఈమానుషప్రాణియొక్క బాహ్యస్థితులనుమాత్రమే బాగుపరుచుటకు జాగ్రత పడునది ఖండనము ఇది ఖండించుటయందున్ను భాగించుటయందున్ను గట్టిదికాని మతసంబంధమైనశక్తి నిలువతగిన ఒకపునాదిని కట్టలేదు. మూడవది విద్యాభిరుచి. ఈలోగడవిద్య చాలాఎక్కువై ఒకగ్రంథము లోని మాటల బలమునున్ను వాక్యలక్షణమునుబట్టి జనులుదాని బలాబలములను గురించి తీర్పుచేయ నుద్యుక్తులై యున్నారు.

వీటికన్నిటికిని మేమివ్వగల ఉత్తర మొక్కటే. అదిఒక సిద్ధాంతముకాదు, మతముకాదు, సంఘముకాదుగాని జీవించుచున్న క్రీస్తే. ఆయన చనిపోయెనుగాని ఎన్నటికిన్ని జీవించుచు సమస్తమైన చిక్కులనున్ను, ప్రశ్నలనున్ను, తప్పులనున్ను విప్పు తాళపుచెవులను గలవాడై యున్నాడు. మనకు మంచిలౌకిక సాంగత్యములు కుదర్చబడి, మనకు కావలసిన వస్తుసామాగ్రులన్నియు బాగుగ సమకూర్చబడుచున్నప్పటికి మనహృదయము దేవుని ప్రేమతో తృప్తిపడుచుంటేనే తప్ప, మరియొక విధముగా అతృప్తి ప్రారంభమవును. జీవమును గురించిన్ని, జీవాంతమును గురించిన్ని దేవుని గురించిన్ని అనేకప్రశ్నలు ప్రతిమనిషియొక్క మనసులో కలుగుచుండును. వీటికన్నిటికిని సమాధానము చెప్పు మూలసిద్ధాంతమేదనగా క్రీస్తు తనలోనిండియుండు సత్యమును మన ఆత్మకు బైలు పరుచుటయే. ముఖ్యమైనబలము వట్టిమాటలయందును, అలంకారములయందును, వాక్చాతుర్యమునందును లేదుగాని వాక్యము మనలోపల నివసించి వెలపలక్రియ జరిగించుటలోనున్నదని మనుష్యులు ఇంకా నేర్చుకొనవలసియున్నది. ఈ వాక్యము దేవునియొక్క

జ్ఞానమున్ను బలమున్నైన్నియుండి మనస్సాక్షంబు అడుగుననుండు అంతరింద్రియములలో తనపనిని జరిగించును.

ఈ కాలమునందలి అసమాధానమునకున్ను ప్రయాసమునకున్ను పరమౌషధము దేవుని నిత్యకుమారుడగు యేసుక్రీస్తే. అయితే ఆయన తన్నుతానే బైలుపరచుకొననేరకు బైలుపరచుకొనడు. పరిశుద్ధత్రిత్వమునందు ముగ్గురును ఒకరినొకరు బైలు పరచుకొందురు. కుమారుడు తండ్రిని బైలు పరచును. అయితె కుమారునియొక్క ప్రత్యక్షము పరిశుద్ధాత్మయొక్క సాక్ష్యమువల్ల కావలెను. ఈప్రత్యక్షము కొన్ని పరియాయములు పరిశుద్ధాత్మతానే జరిగించును అయితే ఈపని సర్వసాధారణముగా సంఘముద్వారా జరగవలెను. కాబట్టి ఇప్పుడు కావలసినదేమనగా పరిశుద్ధాత్మయొక్క సేవవల్ల దేవుని కుమారుడు ఆయన సమస్తసౌందర్యముతో బైలుపరచబడుటయే. ఈపనిని పరిశుద్ధాత్మ సంఘమనబడు మర్మమైన ఆపరిశుద్ధ శరీరములోని అవయవమ్ముల పరిశుద్ధులద్వారా జరిగించును. ఇందుకొరకు లోకము కనిపెట్టాయున్నది.

ఈతారతమ్యమును గురుతుపెట్టుట అత్యావశ్యకము. ఈకాలమునందు చిక్కుగానుండు వాటినన్నిటిని విప్పునది ఈ పరిశుద్ధాత్మ నే అని తలంచునట్లు కనుపడును. ఇక రాబోవుయుగమందు మనము దేనినిగురించి సాక్ష్యము చెప్పవచ్చునో మనకు తెలియదుగాని ఇప్పటి యుగమందు సమస్తసందేహములనున్ను నివారణచేయునది క్రీస్తుయందు దేవుడుమాత్రమే అనినుమనకు స్పష్టముగా తెలియును. ఈయనే దేవునియొక్క అవును ఆమేన్, అలాఫ్ మెగ, (మొదటిఅక్షరము చివరిఅక్షరము), గుడ్డివారికిదృష్టి, పక్షవాయువు రోగులకు స్వస్థత, మలినులకు నిర్మలము, మృతులకు జీవము, బీదలు దుఃఖాక్రాంతులు అసహాయకులు అయినవారికి సువార్త. అయితే క్రీస్తు సంబంధమైనవాటిని ఎత్తి మనకు సవిస్తారముగా బైలు పరచునట్లు ఆయన తనఆత్మను అనుగ్రహించునుగాకని మనము ఆశించుచున్నాము. శిష్యులు తండ్రినిచ

రుగవలెనని కోరినప్పుడు ప్రభువు "నన్ను చూచినవాడు తండ్రినిచూచి యున్నాడ"ని చెప్పెను. అనగా "నాముఖముమీద ప్రకాశించునది ఆయనమహిమయే, నా జీవమునంతటిని క్రమపరుచునది ఆయనచిత్తమే" నాసేవయందు నెరవేరునది ఆయన ఉద్దేశమే" అని ఆయన తాత్పర్యము. ఈ లాగుననే దివ్య పరిశుద్ధాత్మ తనద్వారా మనము క్రీస్తును గురించి తలంచునట్లు చేయును, పరిశుద్ధత్రిత్వమునందు ఆయన క్రీస్తుతో ఒకడై యుండి ఆయనను బైలుపరుచుటకే నచ్చియున్నాడు.

క్రైస్తవ శతాబ్దములని చెప్పబడు శతాబ్దములన్నిటను పరిశుద్ధాత్మయొక్క శబ్దము స్వయముగానున్ను మధ్యస్థముగానున్ను ప్రభువునుగురించి సాక్ష్యము చెప్పియున్నది. చాలామట్టుకు వ్యాపించినరీతిగా మనుష్యులయొక్క మనస్సాక్షిని జీవింపజేయుట యందును, మత ఉజ్జీవనముల యందును, దైవసత్యము జ్ఞానాభివృద్ధికాలముల యందును, [illegible] పుట్టిఆదరించబడి నేర్పబడుచుండు ప్రతి ఆత్మయందును స్వయము [illegible]నున్ను, విశ్వసించినవారి సమూహమగు సంఘముద్వారా జరిగించి పనిని మధ్యస్థముగానున్ను ఈఆత్మ జరిగించియున్నాడు. అయితే దేనిద్వారా ఈఆత్మతనపనిసజరిగించునో ఆసంఘమువల్లఅయ్యో! ఎంతో వ్యసనకరముగా ఈసాక్ష్యముచాలామట్టుకు ఆటంకపరచబడియున్నది. వారి అవిశ్వాసమువల్ల అనేకబలమైన కార్యములు చేయలేకపోయెను. అనగా ఈ అవిశ్వాసము అదృశ్యుడగునట్టియు మహిమపరచబడినట్టియు ప్రభువునుగురించి ఆయాత్మ సంతోషముగా సాక్ష్యము చెప్పకుండా ఆటంకముగా నుండెను. సంఘములోనుండు విభాగములు, విముఖ్యమైనవాటిని గురించిన వివాదము, తములోనుండు భేదములనుగురించి ఎక్కువగాతలంచుట నాస్తికత్వము, ధనము, ఆస్తి అధికారము మొదలైనవాటి ఆశ, తాను దిక్కుమాలినదిగానున్ను, దరిద్రమైనది గానున్ను, గుడ్డిదిగానున్ను, దిగంబరమైనదిగానున్ను, ఉండగా, ధనవంతమైనదానను, ధనవృద్ధిచేసుకొంటిని, నాకు ఏమియుకొదువలేదు అని చెప్పుకొనుట మొదలైనవి సంఘము మంచిసాక్ష్యమివ్వలేకుండా చే

యడమేకాకుండా పరిశుద్ధాత్మను దుఃఖపరచి, ఆర్పి, ఆయనసాక్ష్యము ను రద్దుచేసియున్నవి.

ఈ నిశ్చింత భావముగలిగినట్టియు, ఆటంక కరమైనట్టియు కాలము తీరిపోవుచున్నట్టు అగుపరచుకొన్న గురుతులుచూచి చాలాసంతోషించుచున్నాము. క్రైస్తవ సంఘములనబడు వాటన్నిటియందు నుండు సంఘము అనగా నిజవిశ్వాసుల సముదాయము తెలివితెచ్చుకొని బూడిదలోనుంచిలేచి తనసౌందర్యవస్త్రములతో ధరించుకొనుచున్నది. విశ్వసించువారందరు ఐకమత్యముతో నుండతగినదను అభిప్రాయము ఎక్కడెక్కడను వ్యాపించుచున్నది. మరియు నెవ్వేరుసంఘములవారందరు ఒప్పుకొను సంగతులనుగురించి ఎక్కువగాతలంచి భేదములగు అభిప్రాయములుగల వాటినిగురించి తక్కువగా తలంచవలెననుకోరిక వృద్ధియగుచున్నది. నానాసభలవారు వారిపేళ్లు వారిమతములు ఏమైయున్నప్పటికిని విశ్వాసులందరు లోకమునందంతట నానాచోట్ల తమ ఆత్మ జీవాభివృద్ధికొరకు గొప్పగొప్ప కూటములు జరిగించుచున్నారు. వీటివలన ఆయాసభలకు ఉండువిభేదములు పరిహారమై ఆత్మసంబంధముగా నిజమైనఐకమత్యముకలుగుచున్నది క్రైస్తవులుతమ్మును తాము ప్రభువుకు ప్రతిష్ఠచేసుకొనుటను గురించినట్టియు, హృదయముయొక్కయుజీవముయొక్కయు పవిత్రతను గురించినట్టియుబోధ ఆత్మయొక్క నిమ్మళమైన సన్నపుశబ్దమును ఇంతవరకు అడ్డిచేసి వినకుండునట్లుచేసిన ఆటంకములనన్నిటిని పరిహరించుచున్నది. చాకలివాని సబ్బున్ను కంసాలి అగ్నిన్ని చాలామట్టుకు ఉపయోగించ బడుచున్నవి. అందువల్ల మంచి ఫలములు కలుగుచున్నవి. విశ్వాసులు ఎక్కువస్థిరులుగానున్ను భక్తిగలవారుగానున్ను అవుటచేత పరిశుద్ధాత్మ తమలో నివసించడమును గురించిన్ని, ఆయన బలమును గురించిన్ని తమతోకూడా సాక్ష్యము చెప్పడమును గురించిన్ని ఎక్కువగా అనుభవించి తెలుసుకొను వారైరి.

ఈ గొప్ప పనియొక్క పూర్ణఉద్దేశము మాత్రము నెరవేరిన యెడల మహామహిమగలఫలము దానివల్లకలుగును. మనప్రభువుయొ

క్క పునరుత్థానపు శరీరము ఆయన దైవిక స్వభావపు ప్రేరేపణ కెట్లు లోంగెనో ఆలాగుననే సంఘము తనలో వాసముచేయు దైవాత్మకు లోంగును. మరియు ఈలాగున ప్రభువైనయేసు, మనుష్యుడు ఎంతో అధికముగా నిరీక్షించతగిన వాడుగానున్ను, వానికి సంభవించు సమస్తస్థితిగతులనే చక్రముల కన్నిటికిని నాభివలెనుండును.

ఇట్లు పరిశుద్ధాత్మయొక్క సేవద్వారా ప్రభువైన యేసుక్రీస్తు గొప్పచేయబడి మహిమ పరచబడునట్లును, ఇందుకొరకు విశ్వాసుల హృదయములున్ను ప్రాణములున్ను ఆయన దివ్యమైన ప్రాణాను తెలుసుకొని అంగీకరించునవిగా చేయబడవలెననిన్ని ఈపుస్తకము సిద్ధపరచబడియున్నది. ఇద్దరినోటిసాక్ష్యమువల్ల ప్రతిమాట స్థిరపరచ బడునట్లు ఈగ్రంథకర్తయొక్క సాక్ష్యముతో నాసాక్ష్యమును చేర్చుచున్నాను. మరియు సువార్తయొక్క గొప్పశబ్దమునకు ఉత్తరముగా ఆత్మచెప్పుల వుననుమాట మనమధ్యను ఎక్కువబలముగానున్ను పట్టుదలగానున్ను వినబడునుగాకని ఆయనతో కూడా ప్రార్థించుచున్నాను.



## 1 అధ్యాయము.

### పరిశుద్ధాత్మయొక్క ఆయా యుగముల పని.

### పీఠికగా చెప్పబడుచున్నది.

దీనిని మేము వ్రాయుచు ఆత్మనుగురించిన బోధనవిషయమై కొందరి అభిప్రాయములను చూడగా వేదాంతగ్రంథమునందు ప్రసిద్ధికెక్కిన ఒక పండితుడు ఇట్లు చెప్పుట కనుగొనుచున్నాము:—యేసుక్రీస్తుయొక్క జీవము, ఆయనసేవనుగురించి వ్రాయబడిన గ్రంథములనున్ను, పరిశుద్ధాత్మ ఆయన పనినిగురించి వ్రాయబడిన గ్రంథములనున్ను పోల్చి చూచినట్లైతే వాటికంటె ఇవి ఎంతో తక్కువగా ఉన్నవి. మరియు ఈసంగతినిగురించి ఇప్పుడు వ్రాయబడుచున్న అనేకగ్రంథములందు తగిన నిర్ధారణయున్ను బలమున్ను కొరతగానున్నట్టు స్థాపించబడియున్నది. కాబట్టి ఈముఖ్యమైన సంగతినిగురించి చెప్పబడవలసినవి. ఇంకా చాలాఉన్నది. ఇప్పుడు చెప్పిన కొన్నిమాటలవల్ల మనలో ఒకప్రశ్న కలుగుచున్నది. ఏదనగా త్రిత్వమునందలి రెండవపురుషమునుగురించి ఆలోచించునప్పుడు ఏపద్ధతిని అనుసరించుచున్నామో మూడవపురుషమును గురించి వ్రాయునప్పుడున్నూ అదేపద్ధతిని ఎందుకు అనుసరించి వ్రాయరాదు? క్రీస్తుయొక్క జీవమును గురించి ఎన్నో శ్రేష్ఠములైన గ్రంథములు వ్రాయబడియున్నవి. వీటిలో దాదాపుగా అన్నిటియందును దైవికకథ బేత్లెహేమునుంచి ఆరంభించి ఒలీవాకొండతో ముగించబడుచున్నది. రక్షకుడు తన అవతారమునకు ముందు జీవించుచుండినను ఆయన ఆకాశమునకు ఎక్కి వెళ్ళినతరువాత ఇంకా జీవించుచున్నను ఆయన ఈ లోకములో బ్రతికియుండినకాలపు చరిత్రనుమాత్రమే వ్రాయుటచేత ఒక భాగమును మాత్రమే ముఖ్యముగా నిర్ధారణచేసి కొంతకాలము మనుష్యులకు కనుపడునట్లు ఆయనబ్రతికిన

బ్రతుకున్ను మనుష్యులకు కనుపడని ఆయన నిత్యకాలపు జీవమున్ను వేరు చేయబడుచున్నది.

ఇదే ప్రకారముగా పరిశుద్ధాత్మను గురించి ఆలోచించునప్పుడు ఇప్పుడు ఆయన చేయుచున్న సేవను దీనికిముందు ఆయన చేసినటువంటియు దీనికి తరువాత ఆయన చేయబోవునట్టియు సేవనుంచి ప్రత్యేకించుటచేత ప్రయోజనము కలదని నమ్ముచున్నాము. ఇప్పటి ఆయనసేవకు ఒకవైపున పెంతెకొస్తు ఇంకొకవైపున క్రీస్తుయొక్క రెండవ రాకడ సరిహద్దులై యున్నవి. ఇదివరకు మేము చూచినమట్టుకు ఈ పరిశుద్ధాత్మనుగురించి వ్రాయబడిన గ్రంథములన్నిటిలోనున్ను కార్డినల్ మానింగ్ అను రోమన్‌కాథోలిక్ ఆయనచే వ్రాయబడినది. అనేకవిధముల ఒక శ్రేష్ఠమైన గ్రంథమైయున్నదని ఒప్పుకొనవలసియున్నది. దానిపేరు "పరిశుద్ధాత్మయొక్క ప్రస్తుతపుపని" ఈ గ్రంథమునందు పోపుమతసంబంధమైన తప్పులు చాలా ఉన్నప్పటికిన్ని దానియందు వ్రాయబడిన ముఖ్యసంగతినిగురించి గ్రంథకర్తయొక్క తలంపులు కొన్నివిషయములయందు ఆశ్చర్యకరముగానున్నవి. ఈపుస్తకముయొక్క పేరు చాలా లోతైన అర్థముగలదై యున్నది. యేసుక్రీస్తుకు ఒకనిర్ణయమైన కాలమందు చేయవలసిన పనిఉండి దానిని నెరవేర్చుటకు ఈ లోకమునకు వచ్చి దానిని ముగించినతక్షణమే ఆయన ఏలాగున తన తండ్రియొద్దకు తిరిగి వెళ్లెనో ఆలాగుననే పరిశుద్ధాత్మ ఒకానొక ముఖ్యమైనపనిని నెరవేర్చుటకు ఒక నిర్ణయమైన కాలమునందు ఈ లోకమునకువచ్చెను. దానిని ఇప్పుడు ఆయన జరిగించుచున్నాడు. మరియు తగినకాలమునందు ఆయన దానిని ముగించి తిరిగి పరలోకమునకు ఎక్కివెళ్ళును. ఈ పుస్తకముయొక్క పేరులోనుండు అర్థము ఇదే, మరియు మనము నమ్మువ్రకారముగా లేఖనములు మనకు బోధించునది కూడా ఇదే. ఆత్మయొక్క ప్రస్తుతయుగసేవను గురించి మనము సరిగా గ్రహించినయెడల గడచిన యుగములయందు ఆయన జరిగించినపనిని గురించిన్ని వచ్చేయుగములలో ఆయన చేయబోవు ఇంకా గొప్పపనిని గురించిన్ని మనము నేర్చుకొనుటకు చాలా సహాయముగానుండును.

ఈ ఆత్మయొక్క బోధన అనేకుల మనసులకు అనిశ్చయమైనది గానున్ను మర్మముగానున్ను కనుపడుటకు కారణమేమనగా ఆయన యొక్క ఇప్పటిసేవ దీనికిముందు ఆయనచేసిన సేవకున్ను, ఇకముందు చేయబోవుదానికిన్ని ప్రత్యేకమైనదని తెలుసుకొనకపోవుటయే అని మాకు తోచుచున్నది. ఈ సేవకు నిర్ణయమైన ఆరంభమున్ను అంతమున్ను కలవు. యోహాను సువార్తలో వ్రాయబడిన మనప్రభువుయొక్క కడపటిమాటలను చదువువారెవరున్ను ఈదిగువ చెప్పబడు సంగతిని లక్ష్యపెట్టకనుండలేరు. అది ఏదనగా ప్రవక్తలున్ను దూతలున్ను తన స్వంతరాకడనుగురించి ఎంత స్పష్టముగా తెలియజేసిరో అంతస్పష్టముగా ఆయనే తనకు సమానమైన సహవాసిన్ని తనకు తరువాతవచ్చు దైవపురుషమున్ను, ఆమర్మమైయున్న ఏకమగు దైవత్రిత్వమునందు ఒకడునైన వానిరాకడను గురించి ప్రచురముచేయుటయే. మరియు ఆరాబోవువాడు నిర్ణయమైన పనికొరకు వచ్చుటమాత్రమే కాకుండా నిర్ణయమైన సమయమువరకు ఉండుననికూడా ఆయన తెలియపరిచినట్టు స్పష్టముగా అగుపడుచున్నది. "మీాయొద్ద ఎల్లప్పుడు ఉండుటకు ఆయనమీాకు వేరొకసహాయకునిఇచ్చును" ఈ ఎల్లప్పుడును అనుమాట ఆదిభాషయందలి శబ్దార్థప్రకారము భాషాంతరముచేసినయెడల యుగమువరకు అని ఉండవలసినది. అప్పుడది దానికి అన్వయించిఉండు ఇంకొకభాగమునకు సరిపడియుండును. అది ఏదనగా యేసు తనశిష్యులకు కడపటి గొప్పపనిని ఇచ్చినప్పుడు పలికినమాటలు:— "ఇదిగో, నేను యుగాంతపర్యంతము దినములన్నియు మీాతోకూడనున్నాను." అనునది దీని అర్థము పరిశుద్ధాత్మద్వారా మీాతోకూడనున్నాననియే. ఇట్లు ఆయన ఎడతెగకుండా మనతో నుండడము మనకు వాగ్దత్తము చేయబడియున్నది. మరియు దీనిపరిమితి ఈ యుగము అంతమువరకు. అయితే ఈ యుగము తీరినతరువాత ఆయన ఇక్కడ ఉండడనికాదుగాని పరిశుద్ధాత్మయొక్క ప్రస్తుతపని ఒకటి ఉన్నదని స్పష్టముగా నగుపడుచున్నది. ఈ సంగతిని గురించి పూర్ణముగా చది

వి చూచినయెడల ఇదిస్థాపించబడుచున్నది. ఈ ప్రస్తుతయుగముపరిశు ద్ధాత్మయొక్క యుగమైయున్నది. పెంతెకొస్తుదినమున ఆయన ఆరంభించిన ఈ యుగవుపని ఇప్పుడు జరుగుచున్నది. మరియు ప్రభువైన యేసు పరలోకమునుంచి తిరిగి వచ్చువరకు జరుగుచుండును. అప్పుడ ఇంకొకక్రమము ఆరంభమై ఇంకొక యుగవుపని ఆరంభించును.

క్రీస్తుయొక్క శరీరమునందు పరిశుద్ధాత్మ యేలుబడిని గురించి మోబర్లి అను ఆయనవ్రాసిన ప్రసిద్ధికెక్కిన గ్రంథమునందు ఇంతవరకు నెరవేర్చబడిన విమోచనకార్యమును ఈ గ్రంథకర్త ఈదిగువనుదహరించబడు మూడు భాగములుగా భాగించియున్నాడు:—మొదటియుగము తండ్రియైన దేవుడు, రెండవయుగము కుమారుడైన దేవుడు, మూడవయుగము పరిశుద్ధాత్మయైన దేవుడు, ఈ విభజన సరిగానున్నట్టు కనపడుచున్నది. అలాగునసే పైనచెప్పిన కడపటియుగము పెంతెకొస్తుదినమున ఆరంభమవుటను గురించి ఆయన చెప్పినసంగతికూడా సరిగానున్నది. అది ఏదనగా:—"ఆక్షణమున (అనగా పెంతెకొస్తుదినమున) తుదను లోకముయొక్క కుదురుబాటుకొరకు దేవుని మూడవప్రత్యక్షత యుగము ఆరంభించెను. ఇది అన్నిటికి కుదురుబాటుకాలములు వచ్చువరకు అంత మించదు. మరియొకటి దీనిని వెంబడించదు. ఈ కుదురుబాటు కాలములు అనగా మనుష్యకుమారుడు ఆయన శిష్యులు ఆయనను ఏరీతిగా ఎక్కివెళ్ళుట చూచిరో అదేరీతిగా మేఘములలో తిరిగి వచ్చునప్పుడు అని అర్థము. అయితే పరిశుద్ధాత్మలో పాలుపొందినవారు దానిబలమును ఇదివరకే రుచిచూచిన ఆవచ్చేయుగము ఏమైయుండును అని అడిగినయెడల దానికి ఉత్తరముచెప్ప నగత్యములేదు. ఎందుకనగా ఈ పుస్తకమునందు పరిశుద్ధాత్మయొక్క యుగమును గురించే ముఖ్యముగా విచారించుచున్నాము. గనుక అందుకు కావలసినదంతయు చెప్పియున్నాము.

## 2 అధ్యాయము.

### ఆత్మాగమనము.

యోహాను క్రీస్తుయందు విశ్వాసముంచువారు పొందబోవు ఆత్మనుగురించి మాటలాడుచు "పరిశుద్ధాత్మ ఇంకఇయ్యబడియుండలేదు" అనిచెప్పుటఅత్యాశ్చర్యకరమైయున్నది. యేసుబాప్తిస్మముపొందినప్పుడు ఆత్మ పావురమువలె దిగివచ్చి ఆయనమీదనిలుచుట అనేకులుచూడలేదా? ఆయన ఈలోకమునంతటిని సృష్టించుటయందును పాతనిబంధన కాలమునందు గోత్రకర్తలు, ప్రవక్తలు, దీర్ఘదర్శులు మొదలైనవారికి జ్ఞానమును దేవావేశమును ఇచ్చుటయందును దైవకారకుడై యుండలేదా? ఇట్లుండగా "పరిశుద్ధాత్మ ఇంకఇయ్యబడియుండలేద"ని యోహాను ఏలాగున చెప్పెను? ఈప్రశ్నకు తగిన ఉత్తరము చెప్పుటయే ఈఆత్మను గురించిన బోధనవిషయమై తెలివితో చదువునట్లు చేయుచున్నది. అగస్టైయిన్ అనుభక్తుడు పెంతెకొస్తు దినమునకు పరిశుద్ధాత్మయొక్క జన్మదినమని పేరు పెట్టియున్నారు. అదేహేతువుచేత మరియ తన తొలుచూలుకుమారుని కనిన దినము యేసుక్రీస్తుయొక్క జన్మదినమని చెప్పుచున్నాము. అయినను యేసు ఆబేత్లెహేములోని తొట్టిలో పరుండకమునుపుసహా ఉండెను. ఆయన ఆదియందు దేవునియొద్దఉండెను. సృష్టియందు ఆయన కారకుడై యుండెను. సమస్తము ఆయనద్వారా కలిగెను. అయితే మనము ఒప్పుకొనిన అపోస్తలును ప్రధానయాజకుడుగా శరీరమునందు తనగొప్పతనిని నెరవేర్చునట్లు ఆయన ఈలోకములో జన్మించినప్పుడు మనుష్యావతారుడాయెను. మరియు ఈలాగునదేవుని మనుష్యులకు అగుపరచి లోకముయొక్క పాపముకొరకు తన్నుతానుబలిగా అర్పించుకొనెను. యేసుబేత్లెహేములో జన్మించువరకు ఈలోకమునందు తన ఉద్యోగ ధర్మమునందు అనగా మనుష్యునికిన్ని దేవునికిన్ని మధ్యవర్తిగా తనదైవికసేవ యందుండలేదు. ఇదేప్రకారముగా పరిశుద్ధాత్మను పెంతెకొస్తు దినమయ్యేవరకు మనుష్యులకు

ను క్రీస్తుకును మధ్యవర్తిగా తన ఉద్యోగధర్మమునందు ఉండలేదు కావున పెంతెకొస్తు ఆత్మయొక్క జన్మదినమని అగస్టైన్‌ను చెప్పినమాట ఈదినుపచెప్పు అర్థములయందు నిజమైయున్నది.

1 పరిశుద్ధాత్మ ఆకాలము (పెంతెకొస్తు) మొదలుకొని భూమిమీద తననివాసమును ఏర్పరుచుకొనెను. ఈయుగమందు యేసుక్రీస్తుకు పరలోకము ఎంతనిజముగా వాసస్థానమైయున్నదో అంతనిజముగా క్రైస్తవసంఘముఆత్మయొక్కనివాసమైయున్నది. ఇదియేసుయొక్క ఆమహాసీయమైన మాటప్రకారముగానున్నది. దీనిని గురించి ఒకరుదేవుడు మనుష్యులకుచేయగల వాగ్దత్తములన్నిటిలో మహాగొప్పదిఅని చెప్పిరి. అది ఏదనగా:—"ఒకడు నన్ను ప్రేమించితే, నామాట కాపాడుకొనును; అప్పుడునాతండ్రి అతని ప్రేమించును; మేము అతనియొద్దకువచ్చి అతనియొద్ద నివాసము చేతుము" (యోహాను 14:23) ఈవాగ్దత్తము పెంతెకొస్తుదినమున నెరవేర్చబడెను; మరియు దైవత్రిత్వము నందలి మొదటివారిద్దరు మూడవఆయనద్వారా సంఘమునందు వాసము చేయుచున్నారు. అనగా తండ్రిన్ని కుమారుడున్ను దృశ్యముగానున్ను ప్రత్యక్షముగానున్ను పరలోకమునందుండగా నమ్మకస్థులైన వారిశరీరములయందు సహాయకుడు నివసించుటచేత అక్కడవారు అదృశ్యులుగాఉంటున్నారు. కాబట్టి పెంతెకొస్తు దినమున ఈయుగమంతటి కొరకున్ను భూమిమీదనివసించుటకు వచ్చెననిచెప్పుటచే ఆయన పరలోకములో లేనేలేడని మాఅభిప్రాయముకాదు. అల్పుడైనమనుష్యునిగురించియైతే ఒకడు ఒకస్థలమునకు వచ్చెననగా మరియొకస్థలమును విడిచెనని అర్థము. అయితే దేవునిగురించి అట్లుకాదు. యేసుమహామర్మమైనట్టియు చూచుటకు విరుద్ధముగా కనుపడునట్టియు ఒకానొకసంగతిని చెప్పెను. దాని శబ్దార్థమును మాత్రము తీసుకొని అనేకులు దానినితప్పుగా భావించుచున్నారు. అదేదనగా "ఆకాశమునుంచి దిగినవాడే అనగా ఆకాశములోనుండు మనుష్య కుమారుడేకాని ఆకాశమునకు ఎవడును ఎక్కివెళ్ళలేదు." అనునదే. క్రీస్తు భూమిమీద

నుండియు ఆకాశమహిమలోకూడానుండెను. ఏకకాలమందు ఇక్కడ అక్కడకూడాఉండెను. అదిఎట్లనగా మనమనస్సులో కలిగినఒకతలంపు ను మాటలద్వారా తెలియపరచినప్పుడు అది బైటకు వచ్చినప్పటికిన్ని దానిని మనము తెలియపరచకముందువ లాగునో ఆలాగున నేమనమనస్సు లోనున్ను ఇంకాఉన్నట్టు. కాబట్టి మనదైవప్రభువును గురించిన యీ మాటఎందుకు నమ్మకూడనిదిగా నుండవలెను? మరియు కుమారునిగురించి ఏలాగో ఆలాగే పరిశుద్ధాత్మను గురించిన్ని అనగా ఈఆత్మ ఇక్కడసంఘమునందు నిరంతరమున్ను, తండ్రికుమారులతో అన్యోన్యముగా అక్కడనున్ను ఉంటున్నాడు- మరియు ఈయనవారి యొద్దనుంచి బైలు వెడలి వచ్చినను దైవత్రిత్వమునందు సమభాగస్థుడైయుండి సూర్యకిరణము అదిఎక్కడనుంచి బైలువెడలి వచ్చునో అట్టి సూర్యునినుంచి ఏలాగు ప్రత్యేకించబడలేదో ఆలాగే ఈఆత్మ ఆతండ్రి కుమారులనుంచి ప్రత్యేకించబడలేదు.

2 పరిశుద్ధాత్మ పెంతేకొస్తు దినమున ఒకమర్మమైనరీతిగా అయినను నిశ్చయముగా సంఘముతోఒకటిగా చేర్చబడెను. అయితే త్రిత్వమునందలి రెండవఆయన అవతరించుటఎట్టిదో ఈయన ఇట్లవతరించుట అట్టిదే అని మాఅభిప్రాయము ఎంతమాత్రమునుకాదు. వాక్యము శరీరమై మనలో నివసించినప్పుడు దేవుడు పాపములేని మానవ శరీరముతో ప్రవేశించెను. అయితే పరిశుద్ధాత్మ అసంపూర్ణమై ఇహసంబంధమైయుండు సంఘముతో తన్నుతాను చేర్చుకొనెను. అయినను అది లేఖనానుసారముగా విశ్వాసులయొక్క శరీరములు దేవాత్మయొక్క వాసస్థానములై యున్నవి. ఈవిషయమునందు ఈయుగముయొక్క ముఖ్యలక్షణము కనపడుచున్నది. యేసురాబోవు సహాయకునిగురించి మాటలాడుచు "ఆయనమీతో నివసించుచున్నాడు; మీలో నుండును" అనిచెప్పెను. ఆయనసూచించి చెప్పినఈమాట నిజముగా నెరవేరెను, ఎందుకనగా పెంతేకొస్తు దినముతరువాత పరిశుద్ధాత్మ సంఘములోనున్నట్టు చెప్పబడియున్నది. "దేవునిఆత్మమీలో నివసించి

యుంటే" అనునది రోమా 8వ అధ్యాయములోని పౌలుతనలోనైన బోధనను దేవావేశమువల్ల ఆరోపించుకొనిన సంగతియైయున్నది. శిష్యులు పూర్వకాలమునందు ప్రభువుయెడల చూపిన లక్ష్యమునున్ను వినయమునున్ను ఇప్పుడు పరిశుద్ధాత్మయెడల చూపుచున్నారు. ఈయన ఆయనయొక్క నిజమైన ప్రతినిధిన్ని, అదృశ్యుడగు వానిని దృశ్యపరుచువాడును, విశ్వాసులయొక్క కూటమునందుండు వాడునై యున్నాడు. యెరూషలేములో జరిగిన మొదటిసభయొక్క తీర్పులలో ఈసంగతి ఎంతో నిష్కపటముగానున్ను స్వభావసిద్ధముగానున్ను తెలుపబడుట చూచుచున్నాము. ఎట్లనగా:—పేతురున్ను, యాకోబున్ను, బర్నబాయున్ను, పౌలున్ను ఇంక ఇతరులున్ను కూడియుండగా పరిశుద్ధాత్మ కూడా నిశ్చయముగా వారితో కూడియున్నట్టు "పరిశుద్ధాత్మకును మాకును తోచెను" అని వ్రాయబడియున్నది.

అననీయ, సప్పీరాఅను వారికుట్ర, అబద్ధములవల్ల సంఘమునందు ఆగొప్ప పాపము జరిగినప్పుడు, పేతురు వారిని "పరిశుద్ధాత్మతో అబద్ధమాడుటకు, సైతాను మీహృదయమును ఎందుకు నిండించెను" అనియు "పరిశుద్ధాత్మను శోధించుటకు మీరు దేనినిమిత్తము ఏకీభవించితిరి" అనియు అడిగెను. కాబట్టి ఈలాగున విశ్వాసుల కూటమునందు పరిశుద్ధాత్మయొక్క ప్రత్యక్షసన్నిధి లక్ష్యపెట్టబడడమే కాకుండా ఆయన అట్టి కూటములయందు అధికారిగానున్ను ప్రాధానముగానున్ను ఉండెను. సంఘమునందు అవతరించెనని అందుమా? అవును, క్రీస్తుయొక్కయు సంఘముయొక్కయు ఆత్మావేశమైన వర్ణనలను ఒకదానితో ఒకటి పోల్చిచూచుటవల్ల దీనిని తెలుసుకొనుచున్నాను. క్రీస్తుతన దివ్యశరీరమునకు "ఈదేవాలయము" అని పేరు పెట్టెను. ఈమాటయూదులకు అపవాదముగానున్ను కోపాస్పదముగానున్ను ఉండెను. అయితే సువార్తికుడైన యోహాను దీనిని వివరించుచు "ఆయన తనదేహమనే దేవాలయమునుగూర్చి పలికెను" అని చెప్పెను. ఇదివట్టి ఉపమానలంకారము, లేక పోలిక అని అందుమా? కాదుగాని అదినిజముగా అట్లుం

డెను గనుకనే ఆయన ఆలాగున చెప్పెను. "ఆవాక్యము శరీరమై మన లో నివసించెను, ఆయనమహిమను మనముకంటిమి. (యోహా. 1:14.) ఇది దేవాలయ చిత్రము. దేవుడు మనుష్యులతో వాసముచేయడము నకు లేఖనమునందుపయోగించబడిన మాట, గుడారములోవసించు ట అనునది, మరియు దేవాలయముదేవుని వాసస్థానము. మహిమ అనున దికూడా ఈసంగతితో పొందికగలదై యున్నది. దేవుని సన్నిధికి గురు తైనమహిమమేఘముకృపాసనముమీదనిలిచియుండినప్రకారముగా మ నదివ్యమైనప్రభువుయొక్క హృదయమనుఅతిపరిశుద్ధస్థలమునుంచిదేవుని మహిమప్రకాశించెను. ఈమహిమ ఆయన మహోన్నతునియొక్క నిజ మైన ఆలయమని తెలియపరుచుచు తండ్రినుంచివచ్చి కృపతోను సత్య ముతోను పరిపూర్ణుడైన జన్మైకుని మహిమయై యుండెను.

ప్రభువు ఆకాశమునకు ఎక్కివెళ్ళి ఆత్మను పంపించినతరువాత సంఘము తనప్రభువు అదివరకు వహించిన పేరును తానువహించుచు న్నది. కాబట్టి ఇప్పుడు సంఘము దేవునిఆలయమైయున్నది. ఈ యుగ మునందు భూమిమీద ఇదిగాక మరియొక దేవాలయము లేదు. "మీరు దేవుని ఆలయమై యున్నారనియు, దేవుని ఆత్మ మీలో నివసించుచు న్నదనియు మీకు తెలియదా?" అని అపొస్తలుడు అడుగుచున్నాడు. ఈ మాటలు అతనుసంఘముతో అది అందరుకూడిన స్థితిలోనుండగా పలికెను. "మీరు ప్రభువుయందు పరిశుద్ధదేవాలయము, అందులో మీరుకూడ ఆత్మయందు దేవునికి నివాసస్థలముగా కట్టబడుచున్నారు." అనునది ఎఫెసీపత్రికయందలి ఘనమైన వివరణమైయున్నది. క్రీస్తు త ననుగురించి ఏమాటలనుచెప్పెనో ఆమాటలను సంఘమును గురించి స్ని చెప్పెనను సంగతిని ఇక్కడస్పష్టముగా తెలుపుట చాలును. శిర స్సు ఏలాగుననో మర్మమైయున్న శరీరము ఆలాగుననే వీనిలో ప్రతిదా నియందున్ను పరిశుద్ధాత్మ వాసముచేయుచున్నాడు; ఈలాగున ఒకఅ ర్థమున దేవుడు వీనియందు అవతరించియున్నాడు. ఈ హేతువుచేతనే క్రీస్తు అదృశ్యుడగు దేవునియొక్క పోలికయైయుండి మనుష్యులయెదు

ట శరీరమునందు నిలిచియున్నప్పుడు "నన్ను చూచినవాడు తండ్రిని చూచియున్నాడు" అని చెప్పగలిగియుండెను. ఈ అవతారమువల్ల కాక పోతే, మన మెరిగినమట్టుకు, తెలియబడని దేవుని ఎవరును తెలుసుకొనలేకపోదురు. మరియు చూడబడని దేవుని ఎవరును చూడలేకపోదురు. కాబట్టి యేసు తనతండ్రియొద్దకు తిరిగివెళ్ళి లోకము ఆయనను ఇక చూడకనున్నప్పుడు సంఘమను తన శరీరమునందు అవతరించునట్లు సహాయకుని పంపెను. తండ్రి కుమారునిద్వారా ఏలాగున తన్ను తాను తెలియపరచుకొనెనో, ఇప్పుడు కుమారుడు పరిశుద్ధాత్మద్వారా తన్ను తాను తెలియపరుచుకొనుచున్నాడు. క్రీస్తు ఏలాగున అదృశ్యుడగు దేవునిపోలికయై యుండెనో ఆలాగుననే సంఘము అదృశ్యుడగు క్రీస్తు పోలికయైయుండుటకు నియమింపబడియున్నది. మరియు ఆయన అవయవములు ఆయనతో కూడ మహిమ పరచబడినప్పుడు ఆయన స్వభావముయొక్క స్వరూపములై యుండును.

ఈ యుగముయొక్క మర్మమున్ను మహిమయున్ను ఇదే. అయితే అది మర్మమైయుండుటచేత దాని యథార్థతయందు తక్కువైనది కాదు. అది మహిమగలదై యుండుటచేత క్రియయందు తక్కువైనది కాదు. ఈ ఆత్మనుగురించి వ్రాయబడిన ఒకానొక గొప్ప గ్రంథమునందు ఆయన (ఆత్మ) పూర్వకాలపు స్థితికిన్ని ఇప్పటిస్థితికిన్ని ఉండువ్యత్యాసము ఇట్లు తెలుపబడియున్నది:—"పూర్వకాలమునందు పరిశుద్ధాత్మ విశ్వాసులకు వెలపటనుండి పనిచేయుచుండెను. గాని విశ్వాసుల లోపల శాశ్వతముగా నివసించలేదు. ఆయన మనుష్యులకు కనుపడెనుగాని మనుష్యునిలో అవతరించలేదు. ఆయన విడిచి పనిచేయుచుండెను. నోవహు నావలోనుంచి వెలపలికి విడిచిన గువ్వ ఏలాగు విశ్రమించుటకు స్థలముదొరకక ఇటు అటు తిరుగుచుండెనో ఆలాగే ఆకాలమునందు పరిశుద్ధాత్మ వచ్చుచు పోవుచు ఉండెను; అయితే ఈయన ఈక్రొత్తయుగమునందు యోహాను యేసు తలమీదికి దిగివచ్చుట చూచినటువంటిన్ని, ఈఆత్మకు పోలికగా నున్నటువంటిన్ని ఆగువ్వవ

లె హృదయములో నివసించుచు అక్కడ నిలిచియుండును. ఆత్మ తన కు నిశ్చితార్థముచేయబడినట్లుండి దానిని చూచుటకు తరుచుగా వచ్చుచుండెనుగాని దానితో కలిసియుండలేదు. యేసుక్రీస్తు మహిమపరచబడిన తరువాత పెంతెకొస్తుదినమునరకు ఏరిద్దరికి (మనుష్యుని ఆత్మకు పరిశుద్ధాత్మకు) వివాహము కాలేదు.

3 పెంతెకొస్తు దినమునకుముందు "పరిశుద్ధాత్మ ఇంకా ఇయ్యబడియుండలేదు" అని చెప్పుటకు ఇంకొక మరిస్పష్టమైన హేతువు. "యేసు ఇంక మహిమపరచబడలేదు" అనుమాటలలోనున్నది. మనకు విశదపరచబడు యుగము లక్రమమునందు త్రిత్వమునందు ప్రతివారున్ను మనుష్యుని విమోచన పనిలో ఈభూమిమీద ఒకరితరువాత నొకరు పనిచేయుటచూచుచున్నాము. బోధన ప్రమాణ కాలమున తండ్రియైన దేవుడు భూమిమీదికి దిగివచ్చి సీనాయి మేఘములోనుంచిన్ని కృపా సింహాసనముమీది మహిమలోనుంచిన్ని మనుష్యులతో మాట్లాడెను. కృపాకాలమునందు కుమారుడైనదేవుడు ఈప్రపంచమునందుండి జనులకు బోధించి వారికొరకు కష్టముల ననుభవించి, చనిపోయి తిరిగి లేచెను. ఆయన తనవారిని ఏర్పరుచుకొని వారిసిద్ధపరచుకొను ఈకాలమునందు పరిశుద్ధాత్మయైనదేవుడు క్రీస్తుశరీరమగు సంఘమును నూతనపరచి పవిత్రపరుచుట అనుపనినిజరిగించుచున్నాడు. ఈదైవకార్యము ఆనాను కాలమునుబట్టిన్ని వాటిలక్షణములనుబట్టిన్ని కూడా అగత్యముగానుండవలసిన ఒక వరుస కలదు. మోషేదినములలో "క్రీస్తు ఇయ్యబడియుండలేద"ని చెప్పబడియుండవచ్చును; ఎందుకనగా యెహోవా దేవుని ఏర్పాటు ఇంకపూర్తికాలేదు. బోధన ప్రమాణము వానిబలులు, పోలికలు, పండుగలు, నీడలతోకూడా మొదట యివ్వబడవలసియుండెను. మనుష్యుడు వాని శాలశిక్షకొరకు నియమించబడిన కాలము సమాప్తి అయ్యేవరకు బోధనప్రమాణపు పరీక్షలోనుంచబడవలసియుండెను. అప్పుడు సమస్తమైన గురుతులను నెరవేర్చుటకును తనయందు బలులనన్నిటిని తీర్చివేయుటకున్ను, బోధనప్రమాణము శ

రీరముద్వారా బలహీనమైనందున అదిచేయలేనిదానిని మనకొరకు చేయుటకున్ను, నమ్మే ప్రతివానికి నీతినిమిత్తము బోధనప్రమాణమునకు అంతమైయుండుటకున్ను, క్రీస్తురావలసియుండెను. ఈలాగున తనక్రమముచొప్పున క్రీస్తుమనపాపముల నిమిత్తము శిలువమీద చనిపోయిమనకు నీతి కలుగునిమిత్తము లేపబడుటచే, తనవిమోచనక్రియను ముగించిన తరువాత నిత్యమైన మధ్యస్థుడుగా దేవుని కుడిపార్శ్వమందు ఆసీనుడై యున్నాడు. అటుపిమ్మట పరిశుద్ధాత్మ క్రీస్తుముగించిన ఈపనిని సంఘమునకు తెలియపరుచుటకున్ను సంఘముదానిని అనుభవించునట్లు చేయుటకున్ను దిగివచ్చెను. మొట్టుకు యీసంగతియొక్క సారాంశమేమనగా తండ్రియైన దేవునిపనిని కుమారుడైనదేవుడు మనుష్యుల కొరకు నెరవేర్చినటుల పరిశుద్ధాత్ముడైనదేవుడు కుమారుడైన దేవునిపనిని మానవుల హృదయానుభవమునకు రాజేయును.

వారివారిసేవ విషయమై విచారించినయెడల త్రిత్వమునందలి ముగ్గురికిన్ని పరిశుద్ధమైన భేదముకలదని చెప్పినాచెప్పవచ్చును. క్రీస్తు భూమిమీద తనయుద్యోగమును జరిగించునపుడు తండ్రి “ఈయన నా ప్రియకుమారుడు ఈయనయందునాకు ఇష్టముకలదు; ఈయనమాట ఆలకించుడి” అని చెప్పుచు ఆయనను మెచ్చుకొనుచున్నాడు. పరిశుద్ధాత్మ ఈభూమిమీద తనఉద్యోగమును ఆరంభించినప్పుడు క్రీస్తు “సంఘములతో ఆత్మచెప్పుచున్నదానిని చెవిగలవాడు వినునుగాక” అని ప్పుచు ఆయనను మనయెదుట పొగడుచున్నాడు. ఒకొక్కరు మరియొకరిబోధను జ్ఞాపకముచేయునట్లుగాఒకొక్కరు మరియొకరి సేవనుపూర్తి చేయుచున్నారు. క్రీస్తుయొక్కమాటలున్ను ఆయనపనులున్ను ఆయన స్వాంతమైనవి కావుగాని ఆయనతండ్రివి. “నేను మీతోపలుకుచున్నమాటలు నాకునేనే చెప్పుటలేదు. అయితే నాయందు నివసించుతండ్రి తన క్రియలను చేయుచున్నాడు” అనిఆయన చెప్పియున్నాడు. ఆత్మయొక్క బోధలున్ను మాటలున్ను ఆయనస్వాంతమైనవి కావుగాని క్రీస్తువే. ఎందుకనగా “సత్యముగల ఆత్మవచ్చునప్పుడు, ఆయన సర్వసత్యములోకి

మిమ్మును నడిపించును; ఎందుకనిన ఆయన తనకుతానే ఏమియు చెప్పక వేటిని వినునో వాటిని చెప్పి రాబోవుసంగతులు మీకు తెలియచేసును, ఆయన నావాటిని పుచ్చుకొని మీకు తెలియచేసుటవల్ల నన్నుమహిమపరచును.”

ఈత్రిత్వమునందలి ప్రతివారియొక్క సేవక్రమము నిర్ణయమైనదిన్ని నిత్యమైనదిన్నియున్నది. ఇందువల్ల అదిపాతనిబంధనకాలపు గురుతుల బోధయందు సహాముందుగా తెలియజేయబడియున్నది. అనేకులు గురుతులను గురించి ఉదాసీనముగా మాట్లాడుదురు. అయితే గణితశాస్త్రము ఎంతఖండితమైనదో ఇవి అంతఖండితమైనవి. మరియు ఈ గురుతులు విమోచనయందలి కార్యములయొక్క కాలక్రమములను ఆకాశమునందు సూర్యోదయము మొదలైనవి ఎంతఖండితముగా నిర్ణయించబడుచున్నవో అంతఖండితముగా నిర్ణయించుచున్నవి. పాతనిబంధనయొక్క గుడారములోగాని దేవాలయములోగాని బలిపీఠమునకు ముందుగా గంగాళము ఉంచబడుట ఎక్కడను చూచుటలేదు. ఈబలిపీఠముఅనగా కల్వరిగిరి, గంగాళమనగా పెంతెకొస్తు. మొదటిది బలిరక్తమునున్ను రెండవది పరిశుద్ధపరచు ఆత్మనున్ను చూపునవైయున్నవి. ప్రధానయాజకుడైనను తెలియక మొదట ఇత్తడి పీఠముయొద్దకు రాకుండా గంగాళముయొద్దకు సమీపించినయెడల “ఉదకస్నానము ఇంకా ఇయ్యబడలేదు” అనుగద్దింపుశబ్దమును తప్పకుండవినును. “పరిశుద్ధాత్మ ఇంకా ఇయ్యబడియుండలేద”ను మాట ఎటువంటిదో ఇదియును అటువంటిదే.

మరియు ఒక కుష్ఠరోగి పవిత్రతపొందునపుడు యాజకుడు మొదట రక్తమును వానికుడిచెవి కొనమీదను, కుడిచేతి బొట్టనవ్రేలిమీదను వాని కుడికాలి బొట్టనవ్రేలిమీదను చమరవలెను. అటుతరువాత ఆరక్తముమీద నూనెను చమరవలసియుండెను. అనగా అపరాధమేధపశురక్తముమీద నూనె (లేవి. 14:14-17) ఈ ఆచారము జరిగినప్పుడెల్ల ఈక్రమము ఎన్నడును మార్చబడలేదని ధైర్యముగా చెప్పుచున్నాము.

అనగా నూనెను మొదటచమిరి దానిమీద రక్తమును ఎన్నడును చమరలేదు. ఇట్లు చేసినయెడల సూచనకు బదులుగా సూచకవస్తువును ఉపయోగించినట్లుండును. కల్వరిగిరికిముందుగా పెంతెకొస్తువచ్చుట అసాధ్యము. రక్తము కుమ్మరించబడకముందు ఆత్మ కుమ్మరించబడవల్లకాదు.

విమోచనయందలి ఈరెండు గొప్పఅంశములయొక్క క్రమము ఆదినుంచి నిర్ణయించబడి యుండుటయేగాక ఆగురుతుకాలపు పంచాంగమునందు వాటి తేదీలుకూడా గురుతువేయబడి యున్నవి. పస్కాగొర్రెపిల్ల చంపబడడమనునది వారు దానినెరుగక పోయినప్పటికి మన పస్కాయగు క్రీస్తు మనకొరకు వధింపబడవలసిన సంవత్సరమును, వారమును, దినమును తరతరములుగా చూపించుచుండెను. యెహోవా సన్నిధిని సబ్బాతు మరునాటిదినమున ఆపనను అల్లాడించుట అనునది అనేక శతాబ్దముల క్రిందటనే వారముయొక్క మొదటిదినమున మన ప్రభువు సమాధినుంచి లేచునని చూపించెను. మరియు "సబ్బాతు మరునాడు మొదలుకొని అనగా అల్లాడించుపనను మీరు తెచ్చినది మొదలుకొని ఏడు సబ్బాతులు లెక్కించుకొనవలెను" (లేవీ. 23:15) అను ఆజ్ఞవల్ల ఆత్మదిగివచ్చు దినము పెంతెకొస్తుదినమని నిర్ణయించబడెను. తండ్రియొక్క వాగ్దత్తము నెరవేర్చబడుటకు శిష్యులు ఆమేడగదిలో ఇంతకాలమని నిర్ణయములేకుండా కనిపెట్టుకొని యున్నట్లుగా మనము కొన్నిపరియాయము లనుకొందము. అయితే నిత్యలోకమునందు దేవుని యొద్ద మాత్రమే కాకుండ ఈలోకమందు హెబ్రీయుల ఆచారకాండ పంచాంగమునందు కూడా ఆకాలము నిర్ణయించబడి యుండెను. అందు వల్లనే వారు పదిదినములు ప్రార్థనచేయుచు కనిపెట్టికొని యుండిరి. ఎందుకనగా ప్రభువు సమాధినుంచి లేచి ఈ భూమిమీద సంచారము చేసిన నలుబదిదినములు పోగా ఏడు సబ్బాతులు అప్పటకు ఇంకా పది దినములు మిగిలియుండెను.

ఈ సంగతియొక్క ముగింపు ఏమనగా, దేవుని కుమారుని తరు

వాత భూమిమీద ఆయన ఉద్యోగమును జరిగించుటకు వచ్చినది దేవు
నిఆత్మయే. సంఘముకొరకు ఈ భూమిమీద క్రీస్తు తనపనిని తీర్చువర
కు ఈ లోకములో ఆత్మయొక్క పని సరిగా ఆరంభము కాలేదు. పరి
శుద్ధాత్మయొక్క ఉద్యోగమేమనగా క్రీస్తును ఆయన సమస్తసంపూర్ణ
తతో మనకు తెలియపరుచుటయే. ఫొటోగ్రఫర్ అనుపటములు తీయు
వాడు ఎంత పరిపూర్ణముగా తన అద్దమును సిద్ధపరచుకొనియున్నను
ఎవరిపటము అతను తీయబోవుచున్నాడో అట్టిమనుష్యుడు ఎదుటికివచ్చి
తన స్థానమునందు నిలుచువరకు ఆ అద్దముమీద ఏరూపమున్ను కను
పడదు. మన రక్షకునియొక్క విమోచనక్రియ ఆయన శిలువమీద చ
నిపోయినప్పుడు పూర్తి కాలేదు, మృతులలోనుంచి తిరిగి లేచినప్పుడు
న్ను కాలేదు, మరియు ఒలీవకొండయొక్క అంచునుంచి ఆయనపైకి
ఎక్కివెళ్ళినప్పుడు కూడా పూర్తి కాలేదు గాని ఆయన తన తండ్రి సిం
హాసనముమీద కూర్చుండి "మరణమైతిని గాని, ఇదిగో యుగయుగ
ముల పర్యంతము జీవించుచున్నాను" అని తనసేవ మొత్తముగా చె
ప్పగలిగి యుండువరకు సంఘమునకు తెలియపరుచుటకు సిద్ధమైన పరి
పూర్ణమగు క్రీస్తుగా నుండలేదు. మొదటి ఆదాముయొక్క పాప
మువల్ల పరిశుద్ధాత్మద్వారా దేవునికిన్ని మనుష్యునికిన్ని గల సహవా
సము భంగమై ఐక్యత చెడెను. అయితే రెండవఆదాము శిలువవేయబడి
చనిపోయిన వారిలోనుంచి తిరిగి లేచి దేవుని కుడిపార్శ్వమందు కూ
ర్చున్నప్పుడు చెడిపోయిన సహవాసము మళ్లీ స్థాపించబడెను. ఈ సం
దర్భమున మనప్రభువు చనిపోయినవారిలోనుంచి లేచిన తరువాత చె
ప్పిన "నాతండ్రియు, మీతండ్రియు నాదేవుడును మీదేవుడునైన ఆయ
నయొద్దకు ఎక్కిపోవుచున్నాను" అను మాటలు ఎంతో చక్కనివై
యున్నవి. దేవకుమారుడు తన తండ్రికి తనయెడల గల ప్రేమను మ
నకొరకుకూడా సంపాదించియున్నాడు ఆయనకు ఎట్టి అంగీకారము,
ఎట్టిస్థితి, ఎట్టిఘనము కలవో విమోచనా స్వాతంత్ర్యముచే మనకుకూ
డ అట్టివేకలవు. ఇట్లు ఆయన మనకొరకు సంపాదించిన వాటినన్నిటిని
న్ని స్థిరపరచి వాటిని మనఅనుభవమునకు తెచ్చుటకు పరిశుద్ధాత్ముడు

పంపించబడియున్నాడు. మొదట క్రీస్తుయొక్క ప్రాయశ్చిత్తపు పని జరగనయెడల ఆత్మయొక్క పరిశుద్ధపరుచుపని జరుగుట అసాధ్యము. ఆలాగుననే ఇంకొకపక్షమున మనలోపల ఆత్మక్రియ జరిగించనియెడల మనకొరకు క్రీస్తుచేసిన పని వ్యర్థముగానుండును.

"పెంతెకొస్తను పండుగదినము వచ్చినప్పుడు" అను మాటలకు చరిత్రరీతిగానున్ను, గురుతార్థముగానున్ను, బోధనీయముగానున్ను ఏమిఅర్థమో అది తెలుసుకొనుటకు మనమిప్పుడు సిద్ధముగా ఉన్నాము. నిజమైన అల్లాడించు పనపై దేవాలయమునందు సమర్పించబడెను. సబ్బాతు అయినతరువాత ఆదివారమున తెల్లవారగానే ప్రథమఫలమగు క్రీస్తు సమాధినుంచి లేపబడి మననిమిత్తము అంగీకరించబడి ఇప్పుడు దేవునియెదుట నిలిచియున్నాడు. పునరుత్థానపు దినము మొదలుకొని ఏడు సబ్బాతులు లెక్కించబడగా పెంతెకొస్తుదినము వచ్చెను. అప్పుడు "వారందరు ఏకమనస్సుతో ఒకచోట కూడియుండగా కొట్టుకొనిపోయే బలమైన గాలివలె ఆకాశమునుంచి అకస్మాత్తుగా ఒకశబ్దము కలిగెను; అది వారుకూర్చుండియున్న ఇల్లంతటిని నింపెను. మరియు అగ్ని నాలుకలవలె విభాగించబడిన నాలుకలు వారికి కనబడి వారిలో ప్రతివానిమీద వ్రాలెను. అప్పుడు వారందరు పరిశుద్ధాత్మతో నిండుకొనిరి. బేత్లెహేములోని పశువులతొట్టి దేవుని కుమారునికి ఏలాగు తొట్టిగానుండెనో ఆలాగుననే దేవుని ఆత్మకు మేడగది తొట్టిగానుండెను. ఆపరిశుద్ధశిశువుయొక్క రాక ఏలాగు దేవుడు తనజనులను దర్శించి వారిని విమోచించినాడనుటకు సాక్ష్యముగానుండెనో, పరిశుద్ధాత్మయొక్క రాకయును ఆలాగుననే ఉన్నది. సహాయకుడు ఇక్కడ ఉన్నాడనుసంగతి అక్కడ దేవుని సన్నిధియందు ప్రాపకుడు లేక వకీలుఉన్నాడను దానికి దృష్టాంతమైయున్నది. ఇందువల్ల పేతురు మొదలైన అపొస్తలులు అధికారులయెదుట ధైర్యముగా నిలిచి "మీరు మ్రానున అంటవేసి సంహరించిన యేసును మనపితృలదేవుడు లేపి ఇశ్రాయేలు కుమారుమనస్సు పాపక్షమయుదయ చేయుటకు, అధిపతిగాను, రక్షకు

దుగాను తన కుడిప్రక్కను హెచ్చించెను. మేమును దేవుడు తనకు విధే యులైనవారికి ఇచ్చిన పరిశుద్ధాత్మయు, ఈసంగతులను గూర్చి సాక్షులమై యున్నాము" అని సాక్ష్యము చెప్పిరి. ప్రధానయాజకుడు పరిశుద్ధ స్థలములోనికి ప్రవేశించినప్పుడు అతని వస్త్రములమీది ఘంటలధ్వని అతడు చావక బ్రతికియున్నాడనుదానికి ఏలాగు దృష్టాంతమైయుండె నో, ఆలాగే పరలోకమునుంచి కలిగి ఆమేడగదిలో వినబడిన పరిశుద్ధాత్మయొక్క ధ్వని, మేఘములను తెరద్వారా వెళ్ళి లోపల ప్రవేశించుట అప్పుడే వారుచూచిన ఆ గొప్పప్రధానయాజకుడు తండ్రి సన్నిధియందు వారికొరకు ఇంక బ్రతికియున్నాడను దానికి నిర్వివాదమైన దృష్టాంతరమై యున్నది. ఈలాగు పరిశుద్ధాత్మయొక్క జన్మదినము వచ్చెను. ఇకను ఆయన ఈ భూమిమీద జరిగించిన కార్యములను క్రమముగా విచారింతము.

## 3వ అధ్యాయము.

## ఆత్మయొక్క నామకరణము.

"సహాయకుడు అను పేరు క్రీస్తుకున్ను, ఆత్మకున్ను కూడ చెల్లునదై యున్నది. మరియు అట్లు చెల్లుట యుక్తమే. ఎందుకనగా మనలను ఆదరించుట, ధైర్యపరచుట మనకు దిక్కుగానుండి కాపాడుట వారిద్దరి యుద్యోగమై యున్నది. క్రీస్తు ఈ లోకములో ఉన్నంతమట్టుకు తన శిష్యులకుమాదిరియై యుండెను. పిమ్మట ఆత్మవల్ల నడిపించబడి కాపాడబడునట్లు వారిని ఆయాత్మకు అప్పగించెను. అలాగైతే ఇప్పుడు మనము క్రీస్తుయొక్క పాలనలో లేమా? అని అడిగినయెడల దానికుత్తరము సులభమే. ఏమనగా క్రీస్తు మననిత్యమైన పాలకుడై యున్నాడు, గాని అదృశ్యుడు. ఈభూమిమీద సంచరించుచున్నంతకాలము ఆయన బహిరంగముగా నగుపడుచు తానేవారిని సంరక్షణచేయుచుండెను. ఇప్పుడు తనఆత్మ

చే మనలను సంరక్షించుచున్నాడు. వీరినుంచి కలుగు ఆశీర్వాదములయందు మనకు కనుపడు ఈభేదమును ఎరిగి ఆయన ఈఆత్మకు 'వేరొక సహాయకుడు' అని పేరుపెట్టెను." జాన్ కాల్విన్.

దేవుని కుమారుడు గర్భములో ధరించబడకముందే దేవదూత ఆయనకు పేరుపెట్టెను. "ఆయనకు యేసుఅనిపేరుపెట్టుదువు; ఎందుకనగా ఆయనే తన ప్రజలను వారిపాపములనుంచి రక్షించును"అని చెప్పెను. ఇట్లీయన అనగా దేవుని కుమారుడు ఒకపేరును పొందుటకురాలేదుగాని అదివరకేనిర్ణయమైనపేరులోనుండు అర్థమును నెరవేర్చుటకు వచ్చెను. అదేప్రకారముగా పరిశుద్ధాత్ముడు ఈలోకమునకు రాకమునుపే ఆయనకు మన ప్రభువే పేరుపెట్టెను. "తండ్రి యొద్దనుంచి మీయొద్దకు నేను పంపగల సహాయకుడు (ప్యారక్లీట్) వచ్చునప్పుడు" (యోహాను 15:26) అని పలికెను. పరిశుద్ధాత్మకు ఈపేరు యిక్కడ మొదటిసారిగా పెట్టబడెను. ఇది ఆయన అప్పుడుచేయబోవు క్రొత్తపనికి తగినక్రొత్తపేరుగా నున్నది. ఈప్యారక్లీట్ అనుపేరుకు వ్యాఖ్యానములలో ఆదరణకర్త, లేక, వకీలు, లేక, బోధకుడు, లేక, సహాయకుడు అని భాషాంతరముచేసి యున్నారు. అయితే ఇదేదీని అర్థమనిశాస్త్రీయమైన లేకపౌరాణికమైన గ్రీక్‌భాషనుంచి నిశ్చయించవల్లకాదు. ఎందుకనగా అదిదేవునివల్లనే ఇవ్వబడిన పేరైయుండి ఆయన జీవమువల్లనున్ను ఆయనచరిత్రవల్లనున్ను ఆపేరుకు అర్థమిట్టిదని తెలుసుకొనతగినదై యున్నది. ఆపేరే ఆయనగనుక ఆయనను ఎరుగుటచే ఆపేరుయొక్క అర్థమునున్ను ఎరుగుదుము. యేసుయొక్కపేరును మనము భాషాంతరముచేయుటలేదే ఈయనపేరును ఎందుకు భాషాంతరము చేయప్రయత్నించవలెను? అపోస్తలుల కార్యములుమొదలుకొని ఇప్పటికాలమువరకు జీవించిన పరిశుద్ధులతో కూడిన సంఘచరిత్రనుబట్టి దానికి తగిన అర్థమును చేసుకొనునట్లు అదేపేరును మనభాషలోకూడా ఉంచు

కొనవచ్చునుగదా. ఒకనిఘంటులో చూచుటచేత పరిశుద్ధాత్మకు అర్థము ఇట్టిదని సరిగా గ్రహించలే మనునదినిశ్చయమే. ఆత్మయొక్క అర్థము ఇట్టిదని తెలియజేయు శ్రేష్ఠమైన నిఘంటు ఏదనగా సంఘముయొక్క మనసే. ప్యారక్లీట్ అనుమాటకు పైనచెప్పినవి సరియైన పర్యాయపదములై యుండ వచ్చునుగాని వానిలో ఒకటిన్ని దాని పరిపూర్ణమైన అర్థమును ఇచ్చుటకు తగినదికాదు.

అయినను "ప్యారక్లిటాస్" అను ఈపేరుయొక్క శబ్దార్థమునుంచిన్ని మనప్రభువు ఈభూమిమీదనున్నప్పుడు చేసిన ఆకడపటి సంభాషణనుంచిన్ని మనము ఏమినేర్చుకొనవచ్చునో చూతము. ఈ పేరుయొక్క శబ్దార్థమేమనగా 'సహాయమునకు పిలుచుట' ఆత్మ ఇవ్వబడిన సమయమునందు ఆశిష్యులుండిన స్థితికి ఈమాట ఎంతోతగిన చక్కని శబ్దమైయున్నది. ఎందుకనగా వారికప్పుడు తమప్రభువుయొక్క ప్రత్యక్షదర్శనము లేకనుండెను. ఆయన తమమధ్యనుంచి తీసికొనిపోబడి శిలువకువేయబడి సమాధిలో నుంచబడుటచే వారికి చాలాదుఃఖము కలిగెను. గాని మూడుదినములైన పిమ్మట ఆయన పునరుత్థానమువల్ల వారిదుఃఖము సంతోషమునకు మార్చబడెను. అయితే ఒకమేఘము వారికన్నులకుమరుగుగా ఆయనను కొంచుపోయి తండ్రియొద్దకు ఆయననెళ్ళిపోవుటచేత తిరిగి వియోగము సంభవించెను. దీర్ఘమైన ఈకడపటివియోగమునందు వారు చేయవలసినదేమో వారి ప్రియయజమానుడు అంతకుముందే వారికి తెలిపియుండెను. అదేమనగా ఖాళీగానున్న ఆ ఉద్యోగమునకు మరియొకరిని పంపుమని తండ్రిని వేడుకొనవలసియుండెను. మరియు అట్లు పంపబడవలసిన ఆయన వారిసహాయముకొరకు నియమింపబడిన ప్యారక్లీట్ అయియుండెను.

రక్షకుడు శిష్యులతో "నేనువెళ్ళకుంటే ప్యారక్లీట్ (సహాయకుడు) మీయొద్దకురాడు. నేను వెళ్ళితే ఆయనను మీయొద్దకు పంపుదును." అని వాగ్దత్తముచేసినప్పుడు వారి హృదయములలో ఏమేమి గొప్పసంశయములు కలిగియుండవచ్చునో! రాబోవు ఆశ్చర్యమైన ఆయన ఒకపురుషుడా అని అడుగ నారంభించిరా ? అట్లుభావించుట అసాధ్య

ము. ఎందుకనగా పురుషులందరిలో మహా గొప్పవాడైన ఆయనకు బదులుగా ఈయన రానై యుండెను, ఆయన చేసినవాటికంటె ఈయన గొప్పకార్యములను వీరికొరకు చేసి, ఆయన కలుగజేసినదానికంటె ఎక్కువ తెలివిని ఈయన వీరికి కలుగజేయనై యుండెను. పరిశుద్ధాత్మ యొక్క మూర్తిమత్వమును గురించిన తర్కము క్రీస్తుయొక్క కడపటి సంభాషణనుబట్టి చూడగా బహుఅసంబంధముగానున్నది. గనుక దానిని కావలెనని మానుకొనుచున్నాము. అయితే ఈసంగతిని క్రీస్తుయొక్క స్వంతమైన మాటలనుబట్టి ఆలోచించి అప్పుడు మనకు ఏలాగుతోచునో ఆలాగు నమ్ముదము. మరియు దీనిని క్లుప్తముగానున్ను సాధారణమైనరీతిగానున్ను చెప్పినట్టయితే యేసు ఈభూమిమీద బోధకుడుగానున్ను ప్రవక్తగానున్ను పనిచేయుటను మానుకొననై యుండి అట్లుచేయకముందు మనలను తనతరువాత రాబోవుఆయనకు పరిచయము చేయించుచున్నాడు, అని చెప్పవచ్చును. ఒక చిక్కైన గణితశాస్త్ర సంబంధమైన ప్రశ్నలో తెలియబడని సంఖ్యను తెలియబడిన సంఖ్య ద్వారా ఏలాగున నిర్ణయింతుమో ఆలాగుననే ఈపస్కాపండుగ సంభాషణలో యేసు తెలియబడనట్టియు అదృశ్యుడగునట్టియు, ఇక రాబోవునట్టియు తాను ప్యారక్లీటని పేరుపెట్టిన ఆయనను తెలియబడినట్టియు దృశ్యుడగునట్టియు తనతోపోల్చి ఆయనకు మనలను పరిచయము చేయగోరుచున్నాడు. ఆయన సాదృశ్యములను సరిచూచినయెడల వానిలో విరుద్ధములైనట్టు కనుపడువాటిని అనేకములను కనుగొనవచ్చును. అయితే ఈవిరుద్ధములు రాబోవుఆయన దైవత్రిత్వమునందు నిజముగా ఒకడై యున్నయెడల మనము నిరీక్షించవలసినవే. కాబట్టి అప్పటికి రాబోవు ఆప్యారక్లీటునుగురించి ఈదిగువ నుదహరించు జాడలను కనుగొని యున్నాము.

1 (యోహాను 14:16) లో వ్రాయబడినట్టు ఆయన వేరొకడు అని చెప్పబడినప్పటికి ఆయన, ప్రభువు ఒకటే. వేరొక అను మాటవల్ల ప్రభువు ప్యారక్లీట్ తనకంటె వేరైనవాడని చెప్పినట్లున్నను ఆయనను తనతో సమానమైనవానినిగా కూడా చెప్పియున్నాడు. ఎందుకనగా

నిజమైన ఒక పురుషునికిన్ని వట్టిశక్తి సమానతయైనను పోలికయైనను లేదు. వాగ్దత్తముచేయబడిన ఆయన దేవునిలోనుంచి పుట్టిన ఒకవట్టి శక్తిమాత్రమై యున్నయెడల మనప్రభువు "పరలోకమునందు మీకొరకు ఒక వకీలుగాఉండుటకు వెళ్ళుచున్నాను. భూమిమీద మీకొరకు వకీలుగావుండుటకు వేరొకనిపంపెదను." (1 యోహా 2:1) అనిచెప్పి ఆయనను తనతో సమానమైన వానినిగా చేసుకొనుట అసాధ్యముగా నుండును.

అయితే క్రీస్తు ఈ సహాయకునిగురించి తనకంటె వేరైనవాడైనట్టు మాట్లాడినప్పటికీ "మిమ్మును అనాథులగా విడువను, మీయొద్దకు వచ్చెదను." (యోహా. 14:18) అని చెప్పుటచేత ఆయనే తానుతానే ఆయనఅని పలికెను. ఈ వాగ్దత్తము ఆత్మనుగురించినదని అందరు ఒప్పుకొనుచున్నారు. దాని సందర్భమును చూచినయెడల అట్లు స్పష్టముగా నగుపడుచున్నది. అయినను అదేసమయమున పైనచెప్పినమాటతోకూడా చెప్పినట్టు "నేనుమీకు పంపుసహాయకుడు" (యోహా. 14:26) అనిచెప్పెను. ఈలాగున మనప్రభువు తాను రావడమున్ను పంపడమున్ను ఒకేసంగతియైనట్టున్ను ఆత్మ ఉన్నప్పుడు తానే ఉన్నట్టున్ను తాను లేనప్పుడు ఆత్మ తనకు బదులుగానున్నట్టున్ను చెప్పుచున్నాడు. కాబట్టి ప్యారక్లీట్ అను ఈఆత్మత్రిత్వమునందలి రెండవవాడగు క్రీస్తుయొక్క ప్రతినిధియగు మూడవపురుషుడు గాక మరి ఏమని నిశ్చయించవలెను.

2 ఈ ప్యారక్లీట్ చేతికిందివాడుగానున్నట్లున్నను సంఘమునకు చేయు సేవవిషయములో పైవాడుగా నున్నాడు. "ఆయన తనకు తానే ఏమియుచెప్పక వేటినివినునో వాటిని తెలియజేయును. ఆయన నా వాటినిపుచ్చుకొని మీకుతెలియజేయుటవల్ల నన్ను, మహిమపరుచును. (యోహా. 16:13.14).

త్రిత్వమునందు ఇక్కడనగుపరచబడు ఒకరికొకరికినుండు పరిశుద్ధమైన భేదమును చక్కగా చూడవచ్చును. ఒక్కొకరు తాము తెలియ

జేయువాటిని మరియొకరినుంచి పొంది తమస్తోత్రములయందు ఒకరినొకరు ఘనపరుచుచున్నారు. బెంజెల్ అనుఆయన క్లుప్తముగా తెలుపునట్లు కుమారుడు తండ్రినిన్ని, ఆత్మకుమారునిన్ని మహిమపరుచుచున్నారు. కాబట్టి పరిశుద్ధాత్మయొక్క యుద్యోగము మనము తెలియపరచగలిగినంతమట్టుకు, క్రీస్తుచేసిన పనిని మనుష్యులహృదయములకు ఎరుకచేసి వాటికితాకునట్లు చేయుటగాక మరియేమి? ఆయన పాపమును ఒప్పుకొనజేసినయెడల మనుష్యులకు క్రీస్తుయొక్క కృపగల ఆ విమోచనా కార్యమును చూపి వారాయనను నమ్మకపోవుటచేత వారి తప్పితమును వారికగుపరుచుటచేతనే పశ్చాత్తాపపడువారు అంగీకరించబడడమునుగురించి సాక్ష్యము చెప్పినయెడల ఆ అంగీకారమునకు ఆధారమగు యేసుయొక్క ప్రాయశ్చిత్తరక్తమునుగురించి సాక్ష్యము చెప్పుటచేతనే హృదయమునకు పునర్జన్మమును కలుగజేసి దానిని పవిత్రపరచినయెడల ప్రభువుయొక్క పునరుత్థానపు జీవమును దానికి తెలియపరుచుటచేతనే క్రీస్తు తనలోతాను సమస్తమైయుండి ఆత్మ యెవరిని నూతనపరుచునో అట్టి సమస్తమైనవారిలో ఆత్మద్వారా ఉంటున్నాడు. పరలోకమునందలి క్రీస్తుకు భూమియందలి సహాయకుడు లోబడియుండుటచేత ఈఆత్మ ఎవరిలో వాసముచేయుచున్నాడో అట్టివారు గొప్ప పాఠమును నేర్చుకొనవచ్చును. మరియు ఇది ఉత్పత్తిచేయువారగుటకు కాదుగాని సాక్షులుగానుండుటకు ఎల్లప్పుడు సంతోషించునట్లు చేయును.

పరిశుద్ధాత్మ ఈలాగున క్రీస్తుకు లోబడినవాడైనను రక్షకునియొక్క పోకచేతనున్ను ఆయనకు బదులుగా ఆత్మయొక్క రాకచేతనున్ను సంఘమునకు నిజముగా గొప్ప ప్రయోజనమగుట ఏలాగు? అది అట్లుండునని ఈ క్రిందవచనమునందు స్పష్టముగా చెప్పబడియున్నది. "అయినను నేను మీతో నిజము చెప్పుచున్నాను; నేను వెళ్ళిపోవుట మీకు ఉపయుక్తము. ఎందుకనిన, నేనువెళ్ళకుంటే ఆసహాయకుడు మీయొద్దకు రాడు; నేనువెళ్ళితే, ఆయనను మీయొద్దకు పంపుదును." (యోహా. 16:7) ఆత్మయొక్క ముఖ్యమయిన ఉద్యోగము కుమారుని పనినిగురించి తెలియజేయుటయై యుండుటచేత, ఈఆత్మ

కుమారునియొక్క వట్టిప్రమాణమైనమాత్రము ఉన్నయెడల, మరియొక రు వచ్చునట్లు ఒకరు వెళ్ళిపోవుటచే నేమిప్రయోజనము? అదృశ్యుడగు క్రీస్తుకుబదులుగా దృశ్యుడగు క్రీస్తు వచ్చినట్లేగదా? అని ఎవరయినను అడుగవచ్చును.

ఈ ప్రశ్నకు ఉత్తరము మాకు స్పష్టముగా నగుపడుచున్నది. పరిశుద్ధాత్మ సంఘమునకు తెలియపరుచునది భూలోకసంబంధమైన క్రీస్తునుగురించి కాదుగాని పరలోకసంబంధమైన క్రీస్తునుగురించే అనగా తననిత్యాధికారమును తిరిగి వహించినట్టియు, లోకోత్పత్తికిముందు తండ్రితోకూడ తనకు కలిగిన మహిమను తిరిగి ధరించుకొనినట్టియు, శిలువ మరణమువల్ల తాను సంపాదించిన అమితమగు కృపాయైశ్వర్య భరితుడగునట్టియు, క్రీస్తునే అత్యల్పమగు ఒక దృష్టాంతముతో దీనిని వివరించవలెనంటే, ఒకతండ్రి తనకుటుంబముతో "నాపిల్లలారా! మీ అవసరములకొరకు కావలసినదంతా నేను సమకూర్చియున్నాను. మీరిప్పుడు బీదస్థితిలో నున్నారుగాని చాలా ఐశ్వర్యవంతులు కావచ్చును. నాజ్ఞాతి ఒకడు నాస్వదేశమునందు చనిపోవుటచేత అత్యధికమయిన ఆస్తికి బాధ్యుడనై యున్నాను. నేను మిమ్మును విడిచి సముద్రమును దాటివెళ్ళి నాస్వాస్థ్యమును స్వాధీనపరుచుకొనునట్లు మీరు సంతోషముతో ఒప్పుకొనినయెడల నేను మీతోకూడ నుండుటచే మీరుపొందుదానికంటె వెయ్యింతలు అధికముగా మీకుపంపెదను." అని చెప్పినట్టు. అయితే ఇప్పుడు మనము ఆలోచించుచున్న సంగతియందు మరణశాసనమును వ్రాసి చనిపోయినవాడును క్రీస్తే. బాధ్యుడైనవాడును క్రీస్తే. ఆయన మరణమువల్ల అస్వాస్థ్యము ఉపయోగించతగినదాయెను; ఆయన పరలోకమునకు ఎక్కివెళ్ళినప్పుడు ఆయాస్తిని తనతోకూడ బాధ్యులయినవారికి పంచిపెట్టుటకు పరిశుద్ధాత్మను పంపించెను. ఈ ఆస్తిఏమో పౌలుయొక్క పత్రికలలో మనము అనేకచోట్ల కనుగొనునట్టి రెండు చక్కనిమాటలతో సంక్షేపముగా చెప్పవచ్చును. అవి ఏవనగా:—"ఆయన కృపయొక్క ఐశ్వర్యము" (ఎపెసీ. 1:7) "ఆయన మహిమయొక్క ఐశ్వర్యము" (ఎపెసీ 3:16) శిలువమీద పాపక్షమా

ఘణవల్ల కృపయొక్క ఐశ్వర్యము మనకు దొరికెను. క్రీస్తు మనహృదయములలో విశ్వాసముద్వారా నివసించుటచేతనున్ను మన అంతరంగ పురుషునియందు బలముతో తన ఆత్మద్వారా బలపరచబడుటచేతనున్ను, దేవుని సర్వసంపూర్ణతతో నింపబడుటచేతనున్ను, సింహాసనము మీద ఆయన మహిమయొక్క ఐశ్వర్యము మనకు దొరికెను. ఈ దేవుని యొక్క ఐశ్వర్యము క్రీస్తు మరణమై చనిపోయినవారిలోనుంచి తిరిగి లేచి పరలోకమునకు ఎక్కి వెళ్ళినప్పుడు మాత్రమే పూర్ణముగా వాడుకొనతగినదై యున్నది. ఇందువల్ల యేసు మహిమపరచబడువరకు దైవికలాయరగు పరిశుద్ధాత్మ ఆ యైశ్వర్యమును మనయొద్దకు తెచ్చుటకు పూర్ణమైన బాధ్యతను పొందలేదు.

ప్రభువు తన శిష్యులను విడిచివెళ్ళి రావడమునుగురించి చేసిన సంభాషణలోనుండు "నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నందున" అనుమాట వారిని చాలాకలవరపడునట్లు చేసిన మాటలలో ఒకటై యున్నది. ఈ విషయమునందు యేసుచెప్పిన దానంతటి సందర్భమును చూచిన యెడల దీనిఅర్థము స్పష్టముగానున్నదో లేదో తెలుసుకొనవచ్చును. «మీరునన్ను ప్రేమించియుంటే నేను తండ్రియొద్దకు వెళ్ళుచున్నందున సంతోషించియుందురు; ఎందుకనిన తండ్రి నాకంటె గొప్పవాడు". (యోహా. 14:28) అని అదేసంబంధమున ప్రభువు చెప్పుచున్నాడు. దేవుని కుమారుడు నరావతారమెత్తుటయందు తన్నుతాను రిక్తునిగా జేసుకొన్న విషయమును గురించి లోతుగా ఆలోచించజాలము. లేఖనములలో స్పష్టముగా బోధించబడి యున్నదానిని అనుసరించుట చాలును. అది ఏదనగా «ఆయన దేవుని రూపమందుండి దేవునితో సమానముగా ఉండుట అపహారణమని ఎంచుకొనక మనుష్యుని పోలికయందు కలిగి దాసుని రూపమును ధరించుకొని తన్ను రిక్తుని చేసుకొనెను» (ఫిలిప్పీ 2:6,7) ఇప్పుడు తండ్రియొద్దకు వెళ్లుచున్నాను దానియొక్క అర్థము దేనినుంచి తన్ను రిక్తునిగా జేసుకొనెనో దానితో తిరిగి నింపబడుట లేక దేవునితో తన సమానత్వమును తిరిగి పుచ్చుకొనడము కాకపోతే మరేమి ? ఆయన తన సంఘమునకు ఇదివరకంటె గొ

ప్ప ఆశీర్వాదమును దయచేయ గగిలియుండుట దేవుని కుడిపార్శ్వమం
దు సింహాసనాసీనుడై యుండుటచే ఆయనకు గలిగిన ఎక్కువైన బల
మువల్లను మహిమవల్ల నున్నట్లు కనబడుచున్నది. లూతరు అను భ
క్తుడు ఈ సంగతికి సంభంధించునట్లు "ఇందుచేత నేను తండ్రియొద్దకు
వెళ్లుచున్నాను, ఎందుకనగా అక్కడ నేనిక్కడ ఉన్నదానికంటె గొప్ప
వాడనుగా ఉందును. మరియుఇక్కడ నాకుండు అప్రసిద్ధతనున్ను బల
హీనతనున్ను విడిచి తండ్రియొక్క మహిమలోకిన్ని శక్తిలోకన్ని ప్రవే
శించుట నాకు చాలా మంచిది" అని బహు యుక్తిగా చెప్పియున్నా
డు. ఈ తాత్పర్యమునుబట్టి చూడగా పైన చెప్పబడిన మన ప్రభువు
మాటలయొక్క అర్థము కష్టముగా కనపడదు, ప్యారక్లీట్ యొక్క ప
ని క్రీస్తును అనగా ఆయన జీవమును, ఆయన బలమును, ఆయన ఐశ్వ
ర్యమును, ఆయన మహిమను, సంఘమునకు తెలియ పరచుటయే. క్రీ
స్తు ఈలాగున గొప్పచేయబడుటచేత పైనచెప్పిన లక్షణములు బహుగా
అభివృద్ధి పొందనై యుండెను. "తండ్రికి కలిగినవన్నియు నావి" (యో
హాను 16:15) అని ప్రభువు చెప్పియున్నాడు, ఆయన కొంత కాలము
మట్టుకు తనంతట తానే తన పరలోకపు ఆస్తికిబాధ్యత లేనివానినిగా
చేసుకొన్నప్పటికి ఇప్పుడు దానిని తిరిగి స్వాధీనము చేసుకొననై యు
న్నాడు. "అందుచేతను ఆయన నావాటిని పుచ్చుకొని మీకు తెలియచే
సునని పలికితిని" (యోహాను 16:15) క్రీస్తు దేవుని కుడిపార్శ్వమందుం
డి ఈ భూమి మీద నున్నప్పటికంటె ఎక్కువగా ఇవ్వగలవాడై యు
న్నాడు. కాబట్టి సంఘము క్రీస్తు ఈలోకములో దృశ్యుడుగా నున్నప్పు
డు ఆయన ద్వారా పొందిన దానికంటె ఇప్పుడు ఈ ప్యారక్లీట్ ద్వా
రా ఎక్కువగా పొంద వచ్చును. ఆలాగైతే "సత్యము సత్యము మీ
తో చెప్పుచున్నాను, నేను చేయు క్రియలు నా యందు విశ్వాసముం
చువాడును చేయును. వీటికంటె గొప్పవాటిని అతడు చేయును. ఎందుక
నిన నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నాను" (యోహాను 14:12) అను
యేసు యొక్కకడపటి ప్రసంగము నందలి మాటలు ఈ సందర్భమునం
దు ఎంతోస్పష్టమైన అర్థము నిచ్చునవై యున్నవి గదా. భూమి యం

దలి క్రీస్తు ఈ పక్షమందు మాత్రమే తనకు తాను సమానుడై యు న్నాడు. మరియు పరిశుద్ధాత్మ తన బలమును తన శిష్యులకు ఇచ్చిన యెడల ఆయన చేయు క్రియలను వారున్ను చేతురు. అయితే పరలో కము నందలి క్రీస్తు తండ్రితో సరిసమానుడై యున్నాడు; కాబట్టి ఆ యన తండ్రియొద్దకు ఎక్కి వెళ్లినపుడు ఆత్మ ఆయన వాటిని పుచ్చుకొని సంఘమునకు తెలియ చేయుటవల్ల అది ఇంతకంటె గొప్ప వాటిని చే యును. లేక వేరు మాటలతో చెప్పినట్లైతే జీవప్రవాహము అది బై లు వెడలి వచ్చు ఉత్పత్తిస్థానముయొక్క ఉన్నత స్థితినిబట్టి ఎక్కువ శ క్తిగలదై యుండును. ఇప్పుడు మనము విచారించుచున్న ఈ మర్మ ములు బహు లోతైనవై యున్నవి. లేఖనములను లేఖనములతో పోల్చి చూచుటచేత కలుగు తెలివి చొప్పున మాత్రమే వీటిని గురిం చి మాట్లాడ గలము. క్రీస్తు సమాధినుంచి లేచిన తరువాత శిష్యుల మీద ఊది "ఆపరిశుద్ధాత్మను పొందుడి" అని చెప్పిన యెడల వారు "చాలును ప్రభువా నీలోనుంచి ఆ ఆత్మను పొందియున్నాము" అని చె ప్పి యుందురు. అయినను అయన ఇచ్చుట మాత్రము చాలదు; ఎందు కనగా ఆయన సింహాసనము ఎక్కుదినమును ముందుగా చూచి "అయి తే తండ్రియొద్దనుంచి మీ యొద్దకు నేను పంపగల సహాయకుడు అన గా, తండ్రియొద్దనుంచి బైలుదేరు సత్యముగల ఆత్మ వచ్చునప్పుడు, ఆ యన నన్నుగూర్చి సాక్ష్యము చెప్పును" అని పలికెను. యేసు పైకి ఎక్కివెళ్లినప్పుడు పరిశుద్ధాత్మపైనుంచి శక్తిని ఇవ్వగలిగి యుండెను. కాబట్టి ఆయన వెళ్లిపోవుట ఉపయుక్తమే.

ఈ సహాయకుని ద్వారా సంఘమునకు కలుగు బలము ఏలా గుననో ఆయన ఈ సంఘమునకునై ఇవ్వ ఎంచియున్న నీతికూడా ఆ లాగుననే దీనియొక్క ఉన్నతమైన ఉత్పత్తిస్థానము పరలోకములో ఉ న్నది. "ఆసహాయకుడు వచ్చినప్పుడు నీతినిగూర్చి లోకమును ఒప్పుకొ నచేయును. నేను నాతండ్రియొద్దకు వెళ్లుటవల్ల మీరు ఇకను నన్ను చూడరు గనుక నీతినిగూర్చి" (యోహాను 16:-8-10) క్రీస్తుమీది లోక ములలో మహాత్మ్యముయొక్క కుడిచేతివైపున కూర్చుండువరకు ఆయన

నీతి పరిపూర్ణముగా ముగించబడి నిశ్చయపరచబడలేదని మనము నిజ
ముగా చెప్పవచ్చును. క్రీస్తు తన మరణమువల్ల మీరబడిన బోధన ప్ర
మాణమును పూర్ణముగా నెరవేర్చెను. అయితే ఆయన శరీరము స
మాధిచే విడువబడి లేచివచ్చుటవల్ల సమాధీ ఒకవిడుదలచీటి ఇచ్చినట్టు
గా ఇచ్చువరకు పైన చెప్పిన సంగతి స్థిరపరచబడలేదు. ఆయన పునరు
త్థానమువల్ల పరిశుద్ధతయొక్క ఆత్మ ప్రకారము బలముతో దృఢపర
చ బడెను. (రోమా 1:4) అయితే ఈ సంగతికూడా "దేవుడాయనను
సమస్తమైన దొరతనము మీదను అధికారము మీదను సామర్థ్యము
మీదను ప్రభుత్వము మీదను పెట్టబడియున్న ప్రతినామము మీద
ను ఆకాశస్థలములలో కూర్చుండబెట్టుకొనువరకు (ఎఫెసి 1:20,21)స్థి
రపరచబడలేదు. ఇప్పుడు ఆయన తన పూర్ణమైన మహిమయందు త
న ప్రజలకు జ్ఞానముగాను, నీతిగాను, పరిశుద్ధతగాను విమోచనముగా
ను, చేయబడుటకు" సిద్ధముగా నున్నాడు. మన కొరకు పాపముగాచే
యబడునట్లు శరీరమందు ప్రత్యక్షమైన ఆయన ఇప్పుడు ఆత్మయందు
నీతివంతుడని తీర్చబడి మనకు నీతిగా చేయబడు నట్లును ఆయనయందు
మనము దేవుని నీతియై యుండునట్లును మహిమలోకి చేర్చుకొనబడియు
న్నాడు. అనగా క్లుప్తముగా చెప్పితే క్రీస్తుయొక్క పట్టాభిషేకము
మనము నీతివంతులమని తీర్చబడుటకు అగత్యమైన నియమమై యున్న
దని చెప్పవచ్చును. మనకొరకు శాపముగా చేయబడిన ఆయనకు మ
హిమ ఘనతలనే కిరీటము వేయబడి యుండుట చూచు వరకు మనము
దేవునివల్ల అంగీకరించబడి యున్నామను నిశ్చయత మనకు కలుగ జా
లదు. ఆలాగైతే "నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నాను గనుక" అను
ఈ చిన్నమాట ఎంతో లోతైన అర్థము గలదై యున్నది గదా !

ప్యారక్లీట్ అనగా సహాయకుడు క్రీస్తు వాటినిగురించి మాత్ర
ము బోధించును; అయినను క్రీస్తుకంటె ఎక్కువగా బోధించును. "నేను
మీతో చెప్పవలసిన ఇంక అనేకమైనవి కలవుగాని, ఇప్పుడు మీరు వా
టిని సహించలేరు. అయితే ఆయన, అనగా సత్యముగల ఆత్మవచ్చి
నప్పుడు, ఆయన సర్వసత్యములోకి మిమ్మును నడిపించును." (యోహా

ను. 16: 12, 13.) అనగా ఆయన వారితో "నాబోధను మీకు కొంత మట్టుకు తెలియపరచియున్నాను; ఆయన మీకు పూర్ణముగా తెలియ పరుచును" అని చెప్పినట్టే ఇట్లు చెప్పుటకు ఒక హేతువు స్పష్టముగా నగుపడుచున్నది. ఆయన ఈభూమిమీద ఉన్నప్పుడుచేసిన బోధ అప్పటికి ఇంకా ఉదయించని ఒకవెలుగుచేత వెలిగించబడనైయుండెను. అది ఏదనగా శిలువయొక్కయు, సమాధియొక్కయు, ఆరోహణముయొక్కయు వెలుగు. కాబట్టి ఈసంగతులు జరిగేవరకు క్రీస్తు మతముయొక్క బోధ బాగుగా బయలుపడనిదిగానున్న క్రీస్తుయొక్క శిష్యులకు పూర్ణముగా తెలియజేయబడనిదిగానున్ను ఉండెను. అయితే ఇంతేకాదు. "నేను తండ్రియొద్దకు వెళ్ళుచున్నాను గనుక" అని ప్రభువు పలికిన మాటలు, ఆయన అభిప్రాయమును తెలుసుకొనుటకు ఆధారముగానున్నవి. "ఆయన వేటిని వినునో వాటిని చెప్పి, రాబోవుసంగతులు మీకు తెలియచేసును." (యోహాను. 16:13) దైవత్రిత్వము ఒకరితోనొకరు సంభాషించుట ఆశ్చర్యకరమైయున్నది. ఇందువల్ల ప్యారక్లీట్ విశ్వాసులను ఈభూమిమీద నడిపించువాడైయుండిన్ని, తండ్రియొక్కయు మహిమపరచబడిన కుమారునియొక్కయు సంభాషణను వినుటకు తన చెవిని పరలోకముతట్టు ఒగ్గినట్టు చెప్పబడియున్నది. ఇట్లు తాను తండ్రినుంచిన్ని కుమారునినుంచిన్ని తానువిన్నదానిని భూమిమీదనుండు ప్రభువుయొక్క మందకు తెలియజేయుచు తాను వారికి కనుపడకనే వారిని నడిపించును. క్రీస్తు దీనుడుగా ఈలోకములోనున్నప్పటికంటె పరలోకములోమహిమపరచబడినప్పుడు మనకిచ్చుటకై ఎక్కువజ్ఞానమున్ను ప్రకటనయున్ను గలవాడు కాలేదా? అని మనము వినయముతో అడుగవచ్చును. రాబోవు విషయములలో, మనకు తెలియజేయుటకై, ఇదివరకు తండ్రియొక్క ఆలోచనలలో దాచబడియున్న రహస్యములు లేవా? దీనికి క్రీస్తుయొక్క స్వంతమాటలనుంచి ఒకదృష్టాంతము చూతము. క్రీస్తు తనరెండవ ఆగమనమును గురించి మాటలాడుచు "ఆదినమును గూర్చియు ఆగడియనుగూర్చియు తండ్రిమాత్రమే కాక, ఏమనుష్యుడైనను ఆకాశమునందలి దూతలైనను కుమారుడైనను ఎరుగరు."

(మార్కు. 13: 32) అని చెప్పెను. ఈమాటలకు కొందరు చెప్పునట్లు ఈసంగతిసి ఇతరులకు బైలుపరుచునట్లు ఈఅర్థమందు ఆయనకు తెలియలేదని అనక ధారాళముగా ఉన్నది ఉన్నట్టు అర్థముచెప్పుట మంచిది గనుక ఆయన మనుష్యావతారపు దీనతయందు ఈరహస్యము ఆయనకండ్లకు మరుగై యుండుట సాధ్యమని ఒప్పుకొందము.

అయితే ఈహేతువుచేత ఆయన తిరిగివచ్చుదినము ఇప్పుడు కూడా ఆయనకు తెలియదని వాదించుట అతిసాహసమైన ఊహకాదా? ప్రభువు తనమహిమతో తిరిగి రావడమునకు సన్నిహితమైన కాలమును గురించి విచారించుట పరిష్కారముగా కూడదని స్థాపించుటకు ఆధారముగా పైవచనము ఎంతోవిస్తారముగా వాడుకొనబడుచున్నది. అయితే ఇట్లువాడుకొనువారు, సంఘముయొక్క బాల్యస్థితిని అనగా ఆత్మ ఇంకా ఇవ్వబడని పెంతేకొస్తుకు పూర్వపుదినములను గురించి మాత్రము తలంచుచున్నారు. మనప్రభువు తండ్రియొద్దకు ఎక్కివెళ్ళిన తరువాత మనకు ఇంకా ఎక్కువైన ప్రత్యక్షీకరణమును, అనగా బైబిలులోని ఆశ్చర్యకరమైన ఆకడపటి పుస్తకమును దయచేసియున్నాడను సంగతిని మరచిపోయినామా? ఈపుస్తకముయొక్క ఆరంభమునందును అంత్యమునందును ఈప్రవచన వాక్యములను చదివి, వాటిని నమ్మకముగా గైకొనువారికి ముఖ్యమైన ఆశీర్వాదములు దొరుకునని చెప్పబడియుండలేదా? ఈపుస్తకముయొక్క ముఖ్యలక్షణ మేమనగా కడపటికాలమునందు ఆయాసమయములలో జరగవలసిన సంగతులను గురించిన ప్రవచన వాక్యములున్ను వాటియొక్క మర్మములైన తేదీలున్ను. ఇది బాగాదేవుని వాక్యమును పరిశోధించువారి ననేకులను, మన ఈఅరణ్యప్రయాణమునందు ఆత్మ మనకిట్టి గురుతులనిచ్చుటచేత అవి ఏకాలమును ఏవిధమైనకాలమును సూచించెనో దాని తెలుసుకొనుటకు శ్రద్ధతో పరిశోధించునట్లు చేసెను. ఇది ఇట్లుండగా, అనేకమంది వ్యాఖ్యానకర్తలతోకూడా మనమున్ను మనరక్షకుడు తాను తిరిగివచ్చేకాలము ఇదివరకు తనకు తెలియదని అన్నప్పుడు అదే ఆయన అభిప్రాయము అని నిశ్చయించినయెడల, మనము అమర్యాదస్థులము కామా?

యేసుక్రీస్తు ప్రత్యక్షీకరణము అనగా త్వరగా జరగవలసినవాటిని తన దాసులకు అగుపరుచుటకు, దేవుడు ఆయనకు ఇచ్చినది" అను ప్రత్యక్షీకరణపు ప్రారంభమునందలి ఈమాటలను అవివున్నవి ఉన్నట్టుగా మనము గ్రహించినయెడల అదిఅతిసాహసమైన ఊహాయౌనా? అని అడగవచ్చును. సంఘముద్వారా పెంతేకొస్తు దినము తరువాత ఎక్కువ క్రియలు జరుగుటయు దానికి ఎక్కువ ఐశ్వర్యము కలుగుటయు ఆయన తండ్రియొద్దకు వెళ్ళుటచేతనే. ఆలాగైతే భవిష్యత్తును గురించిన ఎక్కువ ప్రత్యక్షీకరణమునకున్ను సంఘము దాని ధన్యమైన నిరీక్షణను గురించిన సత్యములోకి మరీపూర్ణముగా నడిపించబడుటకున్ను ఇదేకారణమును ఎందుకు చెప్పరాదు? లేకవేరేరీతిగా చెప్పినట్టైతే, క్రీస్తుకు తనతండ్రియొద్ద మొదటకలిగియుండిన మహిమకు తిరిగివెళ్ళినప్పుడు ఎక్కువైన ప్రత్యక్షీకరణముగల వానినిగా ఆయననుగురించి తలంచగలిగినయెడల ఆదివ్యసహాయకునివల్ల ఎక్కువైన సత్యము తెలియపరచబడుననికూడా తలంచకూడదా?

ఆత్మయొక్క ఈక్రొత్తపేరును గురించిన్ని ప్రభువు శిష్యులతో ఆయననుగురించి మాట్లాడుచు జరిగించిన ఆకడపటి సంభాషణను గురించిన్ని ఇట్లు మనము ఆలోచించుటచేత ఆయాత్మయొక్క స్వభావమును గురించిన్ని ఉద్యోగమును గురించిన్ని కొంతమట్టుకు నేర్చుకొనియున్నాము గదా? మెట్టుకు అగత్యములేకనే అనేకమంది గ్రంథకర్తలవల్ల తప్పుగా గ్రహించబడు దేవావేశమువల్ల కలిగిన రెండుశబ్దములకుండు భేదమునుగ్రహించునట్లు ఈపైవిచారణ మనకు సహాయముచేయుతగినదై యున్నది. ఆరెండుశబ్దములు ఏవనగా ఆదిముగ్రీక్ భాషలో "ప్యారక్లీట్" 'ప్యారౌసియ' అనునవి 'ప్యారక్లీట్' అనగా సహాయకుడు అని ఇదివరకే చెప్పియున్నాము. అయితే మనప్రభువుయొక్క రెండవరాకను గురించి తెలుపునట్టి ప్యారౌసియ అను రెండవ శబ్దము కొన్ని గొప్పగ్రంథములలోకూడా పరిశుద్ధాత్మయొక్క రెండవ రాకను గురించి తెలుపునట్లు చెప్పబడియున్నది. మరియు క్రీస్తే ఆత్మస్వరూపమునవచ్చెను గనుక ఆయన తిరిగి మహిమతోవత్తునని చెప్పిన

మాట ఇదివరకే నెరవేరెనని కొందరు వాదింతురు. అయితే ఇట్లువా దించుట లేఖనములలో వెవ్వేరు అభిప్రాయములతో నుపయోగించ బడిన ఈశబ్దములను సరిగా గ్రహించకపోవుటవల్లనే కాబట్టి ఇప్పుడు పైనచెప్పిన రెండుశబ్దములకునుండుభేదమును చూతము:—ప్యారక్లీట్ నందు క్రీస్తు ఆత్మరీతిగానున్ను అదృశ్యుడుగానున్ను వచ్చెను. అయితే ప్యారౌసియాయందు శరీరాకారముతోనున్ను మహిమతోనున్ను వచ్చును. ప్యారక్లీట్ రక్షకుడు శరీరరీతిగా తన ప్రజలను విడిచి వెళ్లుట చేత వచ్చున నై యుండెను. "నేను వెళ్లకుంటే ఆసహాయకుడు మీయొద్దకురాడు (యోహాను 16:7.) అయితే ప్యారౌసియా శరీరరీతిగా తన ప్రజలయొద్దకు తిరిగి వచ్చుటచేత మాత్రమే అనుభవించబడును. "ఎందుకనిన మానిరీక్షణమైనను సంతోషమైనను ఉత్సాహ కిరీటమైనను ఏది? మన ప్రభువైనయేసు వచ్చినప్పుడు ఆయనయెదుట మీరేగదా?" (1 తెస్సలో 2:19) ప్యారక్లీట్ సంఘముయొక్క దీనస్థితి కాలమునందు దానితోకూడనుండి సహాయము చేయును. అయితే ప్యారౌసియ సంఘమును దాని మహిమస్థితిలో ప్రవేశపెట్టును. ప్యారక్లీట్ నందు క్రీస్తు సంఘముతోకూడా భూమిమీద వసించుటకు వచ్చెను. «మిమ్మును అనాథులగా విడువను; మీయొద్దకు వచ్చెదను» (యోహాను 14:18) అయితే ప్యారౌసియా యందు సంఘము మహిమలో తనతోకూడ వాసము చేయునట్లు దానిని తీసుకొని వెళ్ళుటకు వచ్చును. "నేను ఉండు స్థలములో మీరును ఉండుటకు నేను తిరిగివచ్చి మిమ్మును నాయొద్దకు చేర్చుకొందును." (యోహాను. 14:3) క్రీస్తు తాను విడిచివెళ్లుటచే దుఃఖించుచున్న సంఘము విషయమై ఈప్యారక్లీట్ వచ్చునట్లుప్రార్థించెను. "నేను తండ్రిని అడుగుకొందును అప్పుడు ఆయన మీకు వేరొక ప్యారక్లీట్ను (అనగా సహాయకుని) యిచ్చును." (యోహాను 14:16.) ఈపరిశుద్ధాత్మ ఇప్పుడు భూమిమీద పరవాసముగానున్న సంఘముతోకూడా ఆప్యారౌసియాత్వరగా వచ్చునట్లు ప్రార్థించుచున్నాడు. "ఆత్మయు పెండ్లికుమార్తెయు, రమ్ము, అని చెప్పుచున్నారు." (ప్రత్యక్ష. 22:17) కాబట్టి ఈరెండున్ను దాని దాని సంబంధమును బట్టి

గ్రహించబడవచ్చును. పరిశుద్ధాత్మకు ఈకొత్తపేరుపెట్టిన క్రీస్తేమన లను ఆయనతో పరిచయము గలవారినిగా చేయుటచేత ఆపేరుకు అర్థమును చక్కగా చెప్పగలడు. ఆపేరుఆయన మనతో నిజముగాఉన్నాడను దానికి గురుతై యుండి, మనమీ భూమిమీద పరదేశులము పరవాసులమునై యున్నను యెల్లప్పుడు పరిశుద్ధాత్మ సహాయమువల్ల నడుచుకొందము గాక!

# THE EMBODYING OF THE SPIRIT.

# ఆత్మ దేహధారియగుట.

ఈ ఆత్మయొక్క దేహమగు సంఘపుచరిత్రయు దానివ్యాపక త్వమును పెంతెకొస్తుదినమున ఆరంభమాయెను. ఇంతకుముందును విశ్వసించినవారు రక్షించబడిరి మరియు ఆదాముమొదలుకొని క్రీస్తువ రకు ఆవెనుకటి కాలములయందు ఆత్మయొక్క శక్తి మనుష్యులకు ప్ర త్యక్షమగుచు నుండెను. అయితే ఇప్పుడు క్రీస్తుయొక్క భావగర్భిత మగు దేహముగానుండునట్లు ఒకసంఘము ఏర్పరచబడవలసి యుండెను. ఈసంఘము దానిశిరస్సగు క్రీస్తుతో కలిసియున్నదిగానున్ను పరిశు ద్ధాత్మద్వారా ఆయనే దానిలో నివసించునదిగానున్ను ఉన్నది. సంఘ మనగా 'ఆరాధన కొరకున్ను బోధకొరకున్ను స్వేచ్ఛగాకూడుకొను విశ్వాసులయొక్క సమాజము' అని నిర్వచనముగా చెప్పబడి యున్నది. అయితే ఈఅర్థము కేవలముతప్పు అని చెప్పకపోయినా తగినదికాదని చెప్పవలసియున్నది. మానవదేహము చలనముకొరకున్ను పనికొ రకున్ను, చేతులు, పాదములు, కన్నులు, చెవులు మొదలైనవి స్వేచ్ఛ గా కూడుకొనియున్నవని చెప్పుట ఎట్లు నిజముకాదో క్రీస్తుదేహమగు సంఘమును గురించికూడా అది నిజముకాదు. సంఘము లోపటినుండి ఏర్పడుచున్నది. అనగా క్రీస్తు పరిశుద్ధాత్మవల్ల లోపటినుండి ఆత్మయొ క్క సర్వాధికారముచేత పునర్జన్మము నొందినవారికి ఆధారమైయుండి తనలోకి వారిని చేర్చుకొనుచున్నాడు. కాబట్టి శిరస్సును శరీరమును ఏకమైయుండి దైవ్యతనున్ను మహిమనున్ను ఏకరీతిగా అనుభవించు టకు ముందుగా నియమించబడి యున్నవి. ఈవిషయమంతా క్రీస్తున్ను సంఘమున్ను ఒకటైయున్నట్లు వారిపేరుకూడా ఒకటైయున్నది. ఎవ రినిదేవుడు పరిశుద్ధాత్మతో అభిషేకించి ఆయనతో నింపినాడో ఆయ న క్రీస్తని పిలువబడెను. అలాగునవే ఆ ఆత్మయొక్క దేహమును ఆయ

న పరిపూర్ణతయునగు సంఘముకూడా క్రీస్తని పిలువబడెను. "ఏలాగు దేహము ఏకమై అనేకమైన అవయవములు కలదై యున్నదో, మరియు ఏలాగు దేహముయొక్క అవయవములన్నియు అనేకములై ఒక్కదేహమై యున్నవో, ఆలాగే క్రీస్తుకూడా ఉన్నాడు." (1 కొరింతి 12:12.) ఈవచనమునందు స్పష్టముగానున్న ఆశ్చర్యకరమైన ఘనమునందున్న సంఘము క్రీస్తనిపిలువబడుట చూచుచున్నాము. బిషప్ ఆండ్రూస్ అను ఆయన దీనికి వ్యాఖ్యానముచేయుచు. క్రీస్తు పరలోకమునందును భూమిమీదను కూడ ఉన్నాడు; ఎట్లనగా, సంఘమునకు శిరస్సని చెప్పబడుటచేత పరలోకమునందును, ఆయన దేహమగు సంఘము క్రీస్తనిపిలువబడుటచేత భూమిమీదనున్న ఉన్నాడు.

పరిశుద్ధాత్మ పరలోకమునుంచి పంపబడిన తక్షణమే, ఈఆత్మ శరీరమును ధరించడమను గొప్పపని ఆరంభమాయెను. మరియు ఈపని నిర్ణయించబడిన వారిసంఖ్య సంపూర్ణమయ్యేవరకు లేక ఈయుగాంతమువరకు జరుగుచుండును. మర్యాదంగా చెప్పగలిగిన మొదల ఇట్లు చెప్పవచ్చును:—క్రీస్తు పెంతెకొస్తుదినమున ఒక మర్మమైన రీతిగా తిరిగి శిశువాయెను. ఇట్లు పరిశుద్ధాత్మద్వారా ఆయన ఇంకొక పరియాయము మాంసమునందు అవతరించినప్పుడు అప్పటి నూటఇరువై మంది శిష్యులు ఆయన శిశుశరీరమై యుండెను. ఇప్పుడు ఈశరీరముయొక్క అంగములయందు ఎదుగుచు వృద్ధిపొందుచు ఉన్నాడు. మరియు "మనమందరము దేవుని కుమారునియొక్క విశ్వాసజ్ఞానముల ఐక్యములను, పరిపూర్ణపురుషుడౌటకు, క్రీస్తుయొక్క పరిపూర్ణవయః ప్రమాణమునకు చేరేపర్యంతము" వృద్ధిపొందుచు నుండును. అప్పుడు భూమిమీది క్రీస్తు పరలోకమునందు క్రీస్తుతో ప్రత్యక్షముగా ఏకమైయుండునట్లు పైకెత్తబడి శిరస్సును శరీరమును ఏకముగా మహిమపరచబడును. అపొస్తలుల కార్యములలో వ్రాయబడిన ప్రకారము సంఘముయొక్కఏర్పాటు చరిత్రపైన చెప్పబడిన సంగతికి ఎట్లు సరిపడియున్నదో చూడుడి. పెంతెకొస్తు పండుగను గురించిన కథ "ఆదినమందు ఇంచుమించు మూడువేలమంది చేర్చుకొనబడిరి." అనునది పెంతెకొస్తు పం

డుగను గురించిన కథలో ముఖ్యఫలితాంశమై యున్నది. చేర్చుకొనబడిరి అని చెప్పబడియుండుటచే, ఎవరితో చేర్పబడిరి? అని అడుగుట సహజమైయున్నది. రాజైన జేమ్సు ఏలుబడి కాలమునందు బైబిలును తర్జుమా చేసినవారు పైవచనమునందు 'వారితో' అనుమాటలను అదొకపాటుగానుండు సన్న అక్షరములలో అచ్చువేయుటచేత పైప్రశ్నకు ఉత్తరము చెప్పియున్నారుగాని పరిశుద్ధాత్మ అట్లు చెప్పుటలేదు. ఇదే అధ్యాయములో మరికొన్ని వచనములైనతరువాత "రక్షించబడుచున్నవారిని ప్రభువు ప్రతిదినము వారితో కలుపుచుండెను" అని చెప్పినప్పుడు 'వారితో' అనుమాట పరిశుద్ధాత్మ చెప్పినది కాదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. ఇట్టి వ్యాఖ్యానములును, క్రొత్తగా చేర్చబడిన మాటలును, పరిశుద్ధాత్మ చరిత్రయొక్క మొదటి అధ్యాయములోని ఘనమైనబోధను కొంతమట్టుకు చెరుపతగినవై యున్నవి. అయితే "అప్పుడు మరిఎక్కువగా అనేకులు ప్రభువును విశ్వసించి ప్రభువుతో కలుపబడిరి". (అపో. కార్యములు. 5:14). "బహుజనసమూహము ప్రభువుతో కలుపబడెను" (అపో. కార్యములు. 11:24) అనుమాటలు దేవావేశమువల్ల కలిగిన మాటలై యున్నవి. కాబట్టి ఈకలుపబడుట అనగా విశ్వాసులు ఒకరితోనొకరు కలుపబడుటకాదుగాని విశ్వాసులందరు దైవసంకల్పముగా క్రీస్తుతో కలుపబడుటయే. మరియు ఇది స్వేచ్ఛగా కూడుకొను ఒకసమాజము కాదుగాని దేవుని సర్వాధికారముచే శిరస్సుతో చేర్చబడినదై యున్నది. ఈనిర్మాణము శిరస్సువల్ల పరిశుద్ధాత్మద్వారా జరుగుకార్యమై యున్నది.

ఈ పైన సంబాధమైన సంఘములోనికి చేర్చబడు విధమును గురించి అడిగినయెడల దానినిగురించి లేఖనము స్పష్టముగా బోధించుచున్నదెట్లనగా:—ఒక ఆత్మయందు మనమందరమును ఒక్కదేహములోనికి ముంచబడితిమి. (1 కొరింతి. 12:13) నీళ్లలోముంచబడుట ఒక విశ్వాసి ఆచారరీతిగా సంఘములోనికి చేర్చబడుటను సూచించుచున్నది. అయితే ఇదివట్టిగురుతేకాని మరియొకటకాదు. "నేను మిమ్మును నీళ్ళలోముంచుచున్నాను, గాని నా వెనుకవచ్చుచున్నవాడు పరిశుద్ధాత్మ

లోను అగ్నిలోను మిమ్మును ముంచును" (మత్తయి 3:11) అని యోహాను పలికిన ఈమాటలవల్ల బాహ్యాచారమగు నీళ్ళలో బాప్తిస్మమున్ను ఆత్మబాప్తిస్మమున్ను అవి ఆచరించబడు రీతియందు ఒకటైయుండుట చూచుచున్నాము. శిష్యులైనవారు మొదటిదానియందు నీళ్ళలో ముంచబడినట్లు రెండవదానియందు ఆత్మలో ముంచబడవలసి యుండెను. ఇట్టి కార్యము నిజముగా జరిగిన చరిత్రయైయుండెను. ఆమేడగది, అలంకార రీతిగా చెప్పినయెడల, ఆత్మయొక్క విశ్వాసులు ముంచబడినట్టి ఒక తొట్టికి సమానముగా నుండెను. వారు కూర్చుండియున్న ఇల్లంతయు ఆత్మతో నింపబడెను. మరియు వారందరు పరిశుద్ధాత్మతో నిండుకొనిరి. ఆతొట్టిని తిరిగి నింపవలసిన అవసరములేదు. ఎందుకనగా పెంతేకొస్తు ఒకేపరియాయము జరిగియున్నది. అది జరిగినప్పుడు ఆత్మసంఘములో ఎడతెగకుండా వాసముచేయుటకు వచ్చియున్నాడు. కాని ఈ యుగమందలి ప్రతివిశ్వాసియు క్రీస్తుయొక్క శరీరమందు వాసముచేయు ఈ ఆత్మలో ముంచబడుట అగత్యమైయున్నది. అనగా ఈ సంగతిని వేరుమాటలలో చెప్పినయెడల ఆత్మయొక్క ఈ ముంచడము ఒకే పరియాయము సంఘమంతటికొరకు ఇవ్వబడియున్నది. ఇది పెంతేకొస్తు మొదలుకొని ప్యారౌసియా (అనగా ప్రభువుయొక్క రెండవరాక) వరకు వ్యాపించును. "ప్రభువు ఒక్కడే, విశ్వాసము ఒకటే, ముంచడము ఒక్కటే" (ఎఫెసీ 4:5) ఈ యుగమంతటిలోనున్న రక్షించబడువారందరు ఏలాగు ఒకేశరీరమైయున్నారో ఆశరీరమంతటికిని ఇవ్వబడిన ముంచడముకూడ ఒక్కటె. ఈ ప్రకారముగా లేఖనముల అర్థమును మనము సరిగా గ్రహించినయెడల "యూదులమైనను గ్రీసులమైనను, దాసులమైనను స్వతంత్రులమైనను, ఒక్క ఆత్మయందు మనమందరమును ఒకదేహములోనికి ముంచబడితిమి" (1 కొరింథి 12:13) అను సంగతిని దానికాలముకూడా నిజమైయున్నది.

ఈ సందర్భమునందు అరణ్యమునందలి సంఘముయొక్క ముంగురుతు ఈ సంగతిని గ్రహించుటకు సహకారిగా నుండవచ్చును:—
"సహోదరులారా ఇది మీకు తెలియకుండుట నాకు ఇష్టములేదు;

అదేమనగా, మనపితృలందరు మేఘముక్రింద ఉండిరి; వారందరు సముద్రముద్వారా నడిచివెళ్లిరి. వారందరు మోషేలోకి మేఘములోను సముద్రములోను ముంచబడిరి. (1 కొరింథి 10:1) సముద్రముద్వారా నడిచి వెళ్లుటచేత మోషేలోకి ముంచబడి తమ్మును నడిపించుకొనివెళ్లువాడగు ఆయనతోకూడ ఏకీభవించినవారై ఒకసహవాసకూటముగా ఆయనకు అప్పగించబడియుండిరి. అదేప్రకారముగా వారు యెహోవాలోకిన్ని వారు ముంచబడిరి. ఆయన ఇప్పుడు మహిమ మేఘములో దండుమధ్యకువచ్చి అంతరువాత వారితో నివసించుచుండెను. దేవావేశమువల్ల కలిగిన గురుతులన్నియు ఏలాగో ఆలాగే ఈ గురుతును సంపూర్ణమైనదై యున్నది. ఈసూచనయొక్క సూచకవస్తువు మొదట యొర్దానునదిలో ముంచడమునుపొంది అటుపిమ్మట ఆకాశమునుంచి దిగివచ్చి ఆయనమీదనిలిచిన పరిశుద్ధాత్మలో ముంచబడిన క్రీస్తుయందు కనుపడుచున్నది. తరువాత కనిపెట్టుకొనియుండిన శిష్యులలో కనుపడుచున్నది. వీరు అంతకుముందుపొందిన నీళ్లలో బాప్తిస్మముకాకుండా ఇప్పుడు పరిశుద్ధాత్మలోనున్ను అగ్నిలోనున్ను ముంచబడిరి. అప్పటినుంచి వారు తమపితృలు అరణ్యములోనున్నట్టు దైవికమైన మూలద్రవ్యములోనుండిరి. అయితే శారీరములో కాదు గాని, ఆత్మలోనే. (రోమా 8:9). వారు ఆత్మమట్టుకు దేవునిప్రకారము జీవించుటకున్ను (1 పేతురు 4:6) ఆత్మవల్ల నడుచుకొనుచుండుటకును, (గలతి 5:25) ఎల్లప్పుడును ఆత్మయందు సమస్తవిధమైన ప్రార్థనతోను యాచనతోను ప్రార్థించుచుండుటకును (ఎఫెసీ 6:18) పిలువబడిరి. అనగా క్లుప్తముగా చెప్పితే- పెంతెకొస్తు దినమున క్రీస్తుశరీరమంతయు శాశ్వతమైనరీతిగా పరిశుద్ధాత్మఅను మూలద్రవ్యములోకిన్ని ఆయన సన్నిధిలోకిన్ని ముంచబడెను. అయితే దీనికికొందరు అప్పటికి క్రీస్తుశరీరము అనగా సంఘము ఇంక పూర్ణమైనదిగానుండలేదని అక్షేపణచేయవచ్చును. ఇందుకు ప్రత్యుత్తరముగా మేముచెప్పునదేమనగా క్రీస్తు కల్వరిగిరి మీదచనిపోయినప్పుడుకూడ సంఘము పరిపూర్ణమైనదిగానుండలేదు, అయినను విశ్వాసులందరు ఆయనతో చనిపోయినట్లు తిరిగితిరిగి చెప్పబడియున్నది.

ఈ ముంచబడడమను ఉపమానమును మార్చిదానికి బదులుగా దీనికి సమానార్థముగల ఆత్మయొక్క అభిషేకము అనుదానిని ఒకనిమిషము ఉపయోగించి చూతము. ఇందుకు నిర్గమకాండములో మనము ఆలోచించుచున్న సంగతిని దృష్టాంతపరుచుటకు ఒక చక్కనిగురుతు కలదు. అహరోను అభిషేకించబడినప్పుడు మహావిలువైన ఆతైలము అతనితలమీద పోయబడుటయేగాక అతని శరీరముమీదను అతని యాజకవస్త్రముల మీదను దిగజారెను. గాయకుడు ఈ సంగతినిగురించి "ఇదిగో! సహోదరులు ఐకమత్యముగా నివసించుట ఎంతో మంచిది! ఎంతో మనోహరము! అదితలపై పోయబడిన మంచితైలమువలె నుండును; అది అహరోను గడ్డముమీదకారుచు, అతని అంగీలచెంగువరకు దిగజారెను" (కీర్తన 133:1,2) అని పాడెను. మనగొప్పప్రధానయాజకుని గురించి "దేవుడునజరేయుడైన యేసును పరిశుద్ధాత్మతోను బలముతోను, అభిషేకించెను" (అపో. కార్య. 10:38) అని చదువుచున్నాము. అయితే ఆయన ఈ పరిశుద్ధమైన అభిషేకముపొందినది, తన కొరకు మాత్రమే కాదుగాని తనసహోదరుల కొరకుకూడపొందెను. ఇతరులకు ఇచ్చుటకుగాను ఆయన దానినిపొందెను. "ఎవనిమీద ఆత్మదిగినిలుచుట నీవుచూతువో ఆయనే పరిశుద్ధాత్మలో ముంచుచున్నవాడు" (యోహాను 1:33.) ఇప్పుడు మనము ఆకాశములగుండా వెళ్ళి మనగొప్పప్రధాన యాజకుడగు మనఅహరోనును అనగా దేవుని కుమారుడగు యేసును పరలోకములో మహాపరిశుద్ధ స్థలమందు నిలిచియుండుట చూచుచున్నాము. "నీవు న్యాయమును ప్రేమించితివి, అక్రమమును ద్వేషించితివి, అందువల్ల దేవా నీదేవుడు నీపాలివారికంటె నిన్ను ఎక్కువగా ఆనందతైలముతో అభిషేకించెను" (హెబ్రీ 1:9) అనునది ఇప్పుడు దేవునివల్ల ఆయనకు ఇవ్వబడిన శ్లాఘనమైయున్నది. క్రీస్తు అనగా అభిషిక్తుడు ఆయన అభిషిక్తులైన సహోదరులగు క్రైస్తవులకొరకు పైగానిలిచియున్నాడు. మరియు శిరస్సగు ఈయన నుంచి పెంతెకొస్తుదినమున పరిశుద్ధాత్మయొక్క అభిషేకము దిగివచ్చెను. మర్మమైయున్న ఆయన శరీరముమీద అది అతివిస్తారముగా

కుమ్మరించబడెను. అప్పటినుంచి అది ప్రవహించుచునే ఉన్నది. మరియు కడపటి అవయవము ఆయనతో చేర్చబడి ఒకేఆత్మవల్ల, సంఘమనబడు ఒకేశరీరములోకి అభిషేకించబడువరకు ప్రవహించుచుండును.

పెంతెకొస్తు దినమైనతరువాత ఒకానొక సందర్భమునందు పరిశుద్ధాత్మలో ముంచబడడమును గురించి చెప్పబడియున్నదనుమాట నిజమే. కొర్నేలియుయొక్క ఇంటివారిమీదికి ఆత్మ దిగివచ్చినప్పుడు పేతురుకు యోహాను నీళ్ళలో ముంచెను అయితే మీరు పరిశుద్ధాత్మలో ముంచబడుదురు (అ.కా. 11:18) అను ప్రభువు చెప్పినమాట జ్ఞాపకము చేయబడెను. యీసంగతి సంఘచరిత్రలో ముఖ్యమైన నొకగొప్పతరుణమైయున్నది. ఎందుకనగా రాష్ట్రములవారు సంఘములో ప్రవేశించునట్లు విశ్వాసపు తలుపు తెరువబడెను. మరియు కొత్తగా కృపనుపొందిన వీరు అదివరకేవచ్చియున్న ఆత్మలో పాలుపొందినవారైనట్టు కనుబడుచున్నది. అయినను పెంతెకొస్తు దినము ఈ యుగమునందలి సంఘమంతయు ముంచడముపొందినదైయున్నట్టుగానే ఉన్నది. కల్వరిగిరిమీద జరిగిన ఆమహాకార్యము ఒకేపరియాయము ఏలాగుజరిగెనో ఆమేడగదిలో జరిగిన ఈ కార్యముకూడా అట్లేజరిగెను.

ఇప్పుడు, పరిశుద్ధాత్మద్వారా క్రీస్తుయొక్క శరీరములోకి ఏలాగు చేర్చబడియున్నామో ఆలాగే ఈశరీరమునకు శిరస్సగు క్రీస్తుతో కూడ చేర్చబడియున్నాము. పరిశుద్ధపరచబడని సంఘము దాని అసంగతమైన నడతవల్ల ప్రభువును ఘనహీనపరుచును. దృష్టాంతముగా, మంచిఘనమైనట్టియు, ఎత్తయిన కనుబొమ్మలు కలిగి చాలాజ్ఞానముతో నిండిన ఒక శిరస్సు అందవికారమైనట్టియు, ఎదగక గిడసపారిన ఒకశరీరముతో కలిసియున్న యెడల చూచుటకు బహుజాలికరముగ నుండునుగదా, ఆలాగుననే, ఈభూమి మీద క్రీస్తుశరీరమన బడు ఘనమైన స్థానమందు నిలిచియుండు సంఘము అపవిత్రముగానున్ను అందవికారముగానున్ను ఉన్నయెడల అది యేసుయొక్క ముఖమును ఎల్లప్పుడు చూచుచుండు పరలోకపు దూతలకున్ను అధికారములకున్ను ఏలాగు సహింపబడవచ్చును! హార్నాక్ అను పండితుడు, ఆదికాలముల యం

దలి సంఘముయొక్క స్థితినిగురించి క్లుప్తముగా దెలుపుచు “మొట్ట మొదట సంఘము క్రీస్తుయొక్క పరలోకపు పెండ్లికుమార్తెగానున్ను పరిశుద్ధాత్మయొక్క వాసస్థానముగానున్ను ఉండెను” అని చెప్పియున్నారు. ఈనిర్వచనము ఎంతలోతైన అర్థముగలదో చూడండి. శరీరమునకు గల మొదటి పవిత్రమైన సంబంధము శిరస్సుతోనే. పెండ్లికుమార్తెయైనది పెండ్లికుమారుని యొక్క రెండవరాకకు మెళుకువతో ఎదురుచూచుచున్న యెడల ఈపెండ్లికుమార్తెను పరిశుద్ధముగా జీవించునట్లున్ను నడుచుకొనునట్లును చేయును. పరిశుద్ధాత్మయొక్క ప్రధానమైనపని “మనప్రభువైన యేసు తన పరిశుద్ధులందరితో వచ్చునప్పుడు, ఆయన మనతండ్రియైన దేవుని యెదుట మీహృదయములను పరిశుద్ధతయందు నిర్దోషమైనవిగా స్థిరపరచుటయే (1 థెస్సలొనీకై. 3:13) ఈముఖ్యోద్దేశమును నెరవేర్చుకొనుటకు ఇతరమైన చిల్లరకార్యములను జరిగించుచున్నాడు. మహిమపరచబడిన క్రీస్తు తన శరీరమగు సంఘముద్వారా లోకమునకు కనుపరచుకొనుచున్నాడు. కాబట్టి ఆయనకున్ను ఆయన దేహమునందలి ఇతర అవయవములకున్ను పూర్ణమైన సంబంధమున్న యెడల లోకమునకు క్రీస్తును నిజముగా చూపించినట్లుండును. ఇందువల్లనే ఈసంఘమును శరీరములో క్రీస్తునివసించి ఆయన సారూప్యమునకు మార్చునట్లు ఆత్మసంబంధముగా జీవించుచున్నాడు. ఈలాగున ఏర్పరచబడిన సంతానమును రాజులైన యాజకుల సమూహమును పరిశుద్ధజనమును, స్వకీయార్థమైన ప్రజలునై యుండుటచే మాత్రమే ఈసంఘము చీకటిలోనుండి ఆశ్చర్యమైన తన వెలుగులోనికి దానిని పిలిచిన వాని సద్గుణములను ప్రచురముచేయగలదు. అయితే ఈలాగు లోకమునకు కనుపరచబడవలసిన ఈక్రీస్తు ఎవరు? ఆయన సింహాసనముమీద నుండి తనపేరును ఇట్లు తెలిపియున్నాడు. మరణమైతిని గాని ఇదిగో యుగయుగముల వరకు జీవించుచున్నాను” (ప్రత్యక్ష 1:18) ఇప్పుడు మహిమలోనుండు క్రీస్తుఊరక ఇప్పుడున్నవాడు మాత్రమే గాకుండ ఇదివరకుండినవాడును, ఇకమీదట ఉండబోవువాడును, సహా ఒక చెట్టుయొక్క ప్రాయము యావత్తు దాని

మాౖనులో ఏలాగున ఇమిడియున్నదో ఆలాగుననే సింహాసనమునీూది యేసు, ఉండినవాడు, ఉన్నవాడు, ఉండబోవువాడునై యున్నాడు. అనగా ఆయన మరణము ఏలాగుననో ఆయన జీవమున్ను నిత్యమైన సత్యమై యున్నది.

ఈవిషయమునందు సంఘము ఆయనవలెనే ఉండుటకు ముందుగా నిర్ణయించబడి యున్నది. ఎందుకనగా అపోస్తలుడు చెప్పినట్టు క్రీస్తనేశిరస్సయిన ఆయనలోనికి అన్ని విషయములయందు ఎదుగుట మాత్రమే కాకుండా ఈయననుంచి సర్వదేహము చక్కగా సంయుక్తపరచబడి ఒక్కొక్కభాగము యొక్క ప్రమాణములో జరిగేబలము చొప్పున సహాయముచేసి ప్రతికీలువల్ల అతకబడి దేహాభివృద్ధి చేసుకొనుచున్నది" (ఎఫెసీ 4:15,16) సంఘము నిజముగా క్రీస్తును ప్రత్యక్షపరచగోరినయెడల అది జీవించునట్టియు మృతిబొందునట్టియు సంఘమై యుండవలెను. దేవునిచే దయచేయబడిన ముంచడమను ఆచారములో అది ఇట్టిస్థితికి అప్పగించబడియున్నది. ,, క్రీస్తుయేసులోనికి ముంచబడిన మన మందరము ఆయన మరణములోనికి ముంచబడితి మని మీరు ఎరుగరా? కాబట్టి తండ్రిమహిమవల్ల క్రీస్తుఏలాగు మృతిబొందిన వారిలోనుండి లేపబడెనో, ఆలాగు మనము కూడా జీవనముయొక్క నూతనస్థితిలో నడిచేనిమిత్తము మరణములోనికి ముంచడమువల్ల ఆయనతోకూడా పాతిపెట్టబడితిమి." (రోమ 6:3,4) ఇప్పుడు మనము దేనిలోనికి తేబడియున్నామో ఆపరిశుద్ధాత్మయొక్క ముంచడము, నీళ్ళలోముంచబడడ మనునది బాహ్యముగానున్న గురుతుగానున్న దేనినిముందుగా సూచించెనో దానిని అంతరంగమునందును ఆత్మరీతిగానున్న నెరవేర్పుటకై నియమించబడియున్నది అనగా మనయందు క్రీస్తుయొక్క జీవమునున్ను మరణమునున్ను తిరిగి అగుపరుచుటయే.

మొదట జీవము. ,, క్రీస్తుయేసులో జీవపుఆత్మయొక్క బోధనప్రమాణము, పాపమరణములయొక్క బోధనప్రమాణమునుంచినన్ను విడిపించెను." (రోమ 8:2) అనగా మనలో ఇదివరకు క్రియజరిగించు

చుండిన బీజము అనగా పాపమరణముల బీజము మరియొకదానిచే స్వాధీనపరుచుకొనబడనై యున్నది. అది ఏదనగా జీవపుబోధన ప్రమాణముదానికి దేవునిపరిశుద్ధాత్మ అగ్రేసరుడున్ను, కాపాడువాడునై యున్నాడు. మన స్వాభావికమైన ఆత్మచేత ఏలాగు మొదటిఆదాముతో సంబంధము గలవారమై అతని పాపస్వభావములో పాలుపొందితిమో ఆలాగే పరిశుద్ధాత్మచేత ఇప్పుడు రెండవఆదాముతో చేర్చబడిన వారమై ఆయన మహిమపరచబడిన స్వభావములో పాలుపొందినవారమై యున్నాము. క్లుప్తముగా చెప్పినట్టయితే క్రీస్తుయొక్క శరీరమునకున్ను పునరుత్థానమైన శిరస్సుకున్ను గల ఐక్యతను కాపాడుటచే ఆశరీరమును జీవముగలదిగా జేయుటయే పరిశుద్ధాత్మయొక్క ఎడతెగని పనియై యున్నది.

రెండవది; అంతర్వాసియైన పరిశుద్ధాత్ముడు ప్రభువుయొక్క మరణమును ఆయన అంగములయందు ఎల్లప్పుడు కగించుచుండవలెను. సర్వమును సర్వములో నింపునట్టి ఆయన పరిపూర్ణతయైన సంఘము, ఈలోకమునందు ఆయన శిలువమరణమును ఆయన పునరుత్థానమును కూడా పరిపూర్తి చేయును. పౌలు నిశ్చయముగా ఈలోతైన యభిప్రాయముతోనే „క్రీస్తుసంఘమైన ఆయన దేహముకొరకు నామాంసమందు ఆయన బాధలలో కొదువలను నావంతుకు నేను సంపూర్ణము చేయుచున్నాను." అని కొలొస్సయులకు వ్రాయుచున్నాడు (కొలస్సై 1:24) అనగా సంఘము తనప్రభువుయొక్క పరిపూర్ణతయై యున్నది గనుక అది సమానాంతరమైన జీవానుభవము మరణానుభవము గలదై యుండవలెను.

సంఘమునకు గురుతుగా ప్రయోగింపబడి యున్న దేహము అనునది బహుప్రసిద్ధమైన భావమును సూచించును. మానవశరీరమునందు జీవము మరణము అనునవి రెండున్నూ ఒకటిగా దానిదాని పని జేయుచున్నవి. దేహములో నుంచి అనుదినము కొంతపదార్థము బైటికి వెళ్ళగొట్టబడి పారిపెట్టబడవలెను. ఆలాగే క్రొత్తపదార్థము దేహము

లో దినదినము సృష్టింపబడి పోషింపబడవలెను. మరణక్రమమును ఆటంకపరచితే, జీవక్రమమును ఆటంకపరచితే ఎంత తారుమారు కలుగునో అంత తారుమారుకలుగును. సంఘమనే ఆయన దేహామును గురించి కూడా ఇది బహుసత్యమైయున్నది. సంఘము శిలువమరణము పొందిన, తనశిరస్సువలెనే దినదినము చనిపోవలెను. మరియు ఆయన మహిమా జీవమును బయలుపరచుచు జీవించవలెను. ఈక్రింద పెద్దఅక్షరములతోనున్న వాక్యమును వేరొకనవీన గ్రంథమునుంచి వ్రాయుచున్నాము. ఇది క్రైస్తవులు బంగారపు మూలవాక్యముగా జేసికొనతగియున్నది. సంఘము క్రీస్తుశ్రమానుభవమును (తానును) అనుభవించుచున్న అంగిమైయున్నప్పుడు అది క్రీస్తుజీవము కలదైయుండును. పాపముచేయునట్టియు నశించినట్టియు మానవకోటివిషయమై పరితాపము కలిగి, శ్రమననుభవించు సంఘముయొక్క విధమాత్రమే కాక, తనప్రభువును నిజముగా బయలుపరచుటకై అది అవశ్యకముగా నుండవలసిన స్థితియునై యున్నది. స్వార్థప్రియమైన సంఘమును క్రీస్తును కురూపిగా జేయును. లోభియైన సంఘము క్రీస్తుకు విరోధముగా అబద్ధసాక్ష్యము పలుకును, లౌకికసంఘము క్రీస్తును తన శత్రువులచేత వెక్కిరింపబడుటకును, దూషింపబడుటకును మరియొకసారి అప్పగించును.

మనమందరము స్పష్టముగా చూచుప్రకారము, మన ప్రభువుయొక్క పునరుత్థానజీవము ఆయన దేహమైన సంఘమునందు వ్యాపింపజేయబడి యున్నది. ప్రతిపునర్జన్మము ఆయన సింహాసనా జీవముయొక్క ధాతుశబ్దమైయున్నది. అయితే ఆయన పునరుత్థానముతోకూడా ఆయన శిలువమరణమును సమానాంతరముగా సాగింపబడవలెనను సంగతిని మనము బహుకొద్దిగ మాత్రము గ్రహించుచున్నాము. "ఎవడైనను నావెంబడిరా గోరితే, తన్ను తాను ఉపేక్షించుకొని, ప్రతిదినము తనశిలువఎత్తుకొని, నన్ను వెంబడించవలెను." సంఘము తనశిరస్సుతో అన్యోన్యముగా నుండి మహిమజీవమున్ను అది లోకములోనున్నది గనుక లోకమువిషయమై శిలువవేయబడిన జీవమున్ను జీవించుటకై పిలువబడియున్నది. యేసుక్రీస్తు యొక్క జీవము మరణము అ

నే రెండుపక్షములను సంఘము బయిలుపరచునట్లు జేయుటకు పరిశు ద్ధాత్ముడు ఎల్లప్పుడు దానియందు (అనగా సంఘమునందు) నిరంతర ము నివశించుచున్నాడు. "మీరు ఏమాదిరి ఉపదేశమునకు అప్పగించ బడితిరో దానికి హృదయముతో విధేయులైతిరి గనుక దేవుడు స్తుతిం చబడునుగాక" అని అపొస్తలుడు వ్రాయుచున్నాడు. (రోమా 6:17) చనిపోయి లేచియున్న క్రీస్తు ఆమాదిరియని సందర్భము తెలియజే యుచున్నది. సంఘము ఆత్మయందు నిజముగా జీవించుచుంటే, కరిగిం చబడిన లోహము అదిపోయబడిన అచ్చురూపముగా ఏర్పడునట్లు, అది ఈదేవుని అచ్చుమాదిరి ప్రకారము విధేయతతో ఏర్పడులాగున ఆ యన దానిని కాపాడును. "ఇప్పుడు అవిధేయతకు మారులయందుపని జరిగించే ఆత్మయొక్క అధికారమునకు అది లోబడియున్న యెడల ఈ లోకమాదిరి ప్రకారము అది స్థిరరూపముగలది యగును. గనుక దా నిని చూచువారు దానియందు క్రీస్తును చూడలేకపోదురు.

5 వ అధ్యాయము.

ఆత్మశక్తి కలిగించడము.

పెంతెకొస్తు దినమునందు పరిశుద్ధాత్మబాప్తిస్మము సర్వకాల మునకు ఒక్కమారే ఇయ్యబడెననియు, అప్పుడు పరిశుద్ధాత్మ పురుషు డుగా వచ్చి సంఘమునందు తన నివాసమేర్పరచుకొనెననియు పూర్వ పు అధ్యాయమునందు చూపించితిమి. అందుచేత, ప్రతివిశ్వాసియు ప రిశుద్ధాత్మ బాప్తిస్మము పొందియున్నాడని తీర్మానింపకూడదు. దేవు డు వరమును ఇచ్చుట ఒకసంగతి, ఆవరమును మనము పుచ్చుకొనుట మరియొక సంగతి. త్రైవత్వమునందలి రెండవ మూడవ పురుషులతో సంబంధము మనకు సమవిధమునసే కలుగును. "దేవుడు తన జనితైక కుమారుని ఇచ్చెను. అనునంతగా లోకమును ప్రేమించెను." (యో హాను 3:16) అయితే తన్ను అంగీకరించిన వారెందరో వారికి అనగా

తన నామమందు విశ్వసించినవారికి దేవునిపిల్లలవుటకు ఆయన అధికారము దయచేసెను." యోహాను 1:12 రక్షణవిషయమైన రెండుపక్షములును, అనగా దైవపక్షమును మనుష్యపక్షమును, బహుముఖ్యముగా అవసరమని మనము పైవాటివల్ల చూచుచున్నాము.

దేవుడు తనకుమారుని లోకమునకు ఇచ్చెను గనుక లోకమంతయు కుమారుని కలిగియున్నదనియు, (అనగా దానికి ఆసంగతి తెలిసినా తెలియకపోయినా కలిగియున్నదనియు) అందుచేత లోకమంతయు రక్షింపబడుననియు ఒకబోధ యిప్పుడు లోకమునందు అక్కడక్కడ ఉంటున్నది. అయితే ఒక్కొక్కడు స్వంతముగా క్రీస్తుయందు విశ్వాసముంచుట అగత్యమనే సంగతిని ఈసిద్ధాంతము నిరాకరించు కారణమును బట్టి, సువార్తబోధ దీనిని ఖండించుచున్న దీనిమేము చెప్పనక్కరలేదు. అయితే భక్తిపరులైన కొందరు గ్రంథకర్తలు పరిశుద్ధాత్ముని గురించి ఇదేవిధముగా వాదించుచున్నారు. ,, పరిశుద్ధాత్మయొక్క శక్తి పొందడము విశేషమైన లేక అధికమైన అనుభవము కాదుగాని దేవునిబిడ్డయైన ప్రతివాడు ఉండునట్టి స్థితియనియు, పెంతికోస్తున కనంతరము మారుమనస్సు పొందిన విశ్వాసులు, వారు వేరేస్థలము లయందుండినను, యెరూషలేమునందు పెంతికోస్తు పండుగప్పుడు, విశ్వాసులు ఏలాగున పరిశుద్ధాత్మచేత నింపబడిరో పెంతికోస్తున కనంతరము మారుమనస్సు పొందిన విశ్వాసులు, వారు వేరేస్థలములయందుండినను ఆలాగే నింపబడిరనియు వారు వాదించుచున్నారు.

అయితే మనము లేఖనములను విచారించిన యెడల, విశ్వాసులు తమరూఢియైన విశ్వాసమువల్ల యేసుక్రీస్తును, ఏలాగున అంగీకరించిరో ఆలాగే వారు పరిశుద్ధాత్మనుకూడా విశ్వాసమువల్ల అంగీకరించుట వారివిధన్ని వారుపొందవలసిన శ్లాఘ్యమున్ను అని స్పష్టముగాచూడవచ్చును. కొన్ని కారణములను బట్టి మేము ఇట్లు తీర్మానించుచున్నాము. పరిశుద్ధాత్మ నిజముగా పురుషుడైయున్నాడు. ఈయన, సంఘములో నివాసమేర్పరచుకొనుటకున్న క్రీస్తుదేహమును నడిపించుటకు

న్ను బోధించుటకున్ను పరిశుద్ధపరచుటకున్ను ఒకనిష్కర్షయైన కాల మునందు ఈలోకమునకు వచ్చెను. కాబట్టి ప్రభువైన యేసుక్రీస్తును, తనగొప్ప సేవ జరిగించుటకు ఏలాగున అంగీకరించితిమో ఆలాగే మన ము పరిశుద్ధాత్ముని కూడా తనగొప్ప సేవను మనయందు జరిగించుటకు అంగీకరించవలెను, యేసుక్రీస్తును అంగీకరించినప్పుడే (అనగా ఆకార్య మునందే పరిశుద్ధాత్మను కూడా అంగీకరించినామని చెప్పుట) లేఖన ముల యందుస్పష్టపరచబడియున్న సంగతిని గందరగోళముచేయుట యై యుండును. ఎందుకనగా మనము పాపులనలె యేసుక్రీస్తును మన నీతికొరకు అంగీకరించుచున్నాము. అయితే కుమారులవలె పరిశుద్ధా త్మను మన పరిశుద్ధతకొరకు అంగీకరించుచున్నాము. "మరియు మీరు కుమారులైనందున అబ్బాతండ్రీ అని మొరబెట్టే తనకుమారుని మన హృదయములలోకి పంపెను." గలతీ 4:6 పరిశుద్ధాత్మ ఇయ్యబడిన తర్వాత పేతురు జనసమూహములతో "పాపక్షమకొరకు మీరుమ నస్సు త్రిప్పుకొని ప్రతివాడు యేసుక్రీస్తుపేరట బాప్తిస్మముపొందుడి, అప్పుడు మీరు పరిశుద్ధాత్మ అనేవరము పొందుదురు." అకా 2:38)

పరిశుద్ధాత్మ అనేవరము మారుమనస్సునకు తర్వాత కలుగున దియని హేతువాదమును బట్టియు కాలమునుబట్టియు పైవచనము స్ప ష్టముగా చూపించుచున్నది. ఈవరము మారుమనస్సునకు ఫలితము గా కలుగునను సంగతిని గురించి ఇకమీదట విచారింతము. అపొస్త లుల కార్యమునందలి ఈవాక్యమునకు ఒక ప్రసిద్ధికెక్కిన క్రైస్తవ గ్రంథకర్త ఈలాగున వ్యాఖ్యానము చేసియున్నాడు అనగా, "పరిశు ద్ధాత్మను అంగీకరించుటను గురించి, ఇచ్చట వ్రాయబడిన దానియందు మనుష్యుల మారుమనస్సును గురించిగాని వారు విశ్వసించుటను గురిం చిగాని చెప్పబడెనని సూచించునది ఏమియు లేదు. అది తరువాత జరు గునని, అదిప్రత్యేకమైన ఆశీర్వాదము. అది ఇదివరకే హృదయము నందు బలముగా క్రియజరిగించే విశ్వాసమును బట్టి కలుగుభాగ్యమై యున్నది. పరిశుద్ధాత్మవరము మారుమనస్సు పొందుసమయమునందే కలుగదని నేను చెప్పనుగాని అదిక్షణమునందు కలుగదని నాభావము.

ఇందుకు కారణము స్పష్టముగానున్నది. మనము క్రీస్తువల్ల విమోచింపబడి, ఆయనయందలి విశ్వాసమువల్ల దేవునికుమారులమై యున్నామను దానినిబట్టి పరిశుద్ధాత్మవరమును పొందుచున్నాము. కాబట్టి దేవునిఆత్మ ఇదివరకే మనయందు పునర్జన్మము కలిగించియున్నాడు. అని స్పష్టముగా నగుపడును." (అని చెప్పుచున్నాడు) మనము ఈవిషయమై లేఖనములను విచారించునపుడు, మనము పాపులవలె క్రీస్తును అంగీకరించినలాగున కుమారులవలె పరిశుద్ధాత్మను అంగీకరించవలెనని చూడగలము. "తన్ను అంగీకరించినవారెందరో వారికి అనగా తన నామమందు విశ్వసించుటను బట్టి మనము కుమారులముగా జేయబడుదుము అని మనము ఇదివరకు చూచియున్నాము. అంగీకరించుట విశ్వసించుట సమభావముగల పదములుగా నుపయోగింపబడి యున్నవి. పునరుత్థానుడైన యేసు తన శిష్యులమధ్య నిలచి "వారిమీద ఊదిపరిశుద్ధాత్మను పొందుడి" అని చెప్పెను. ఇచ్చట పొందుడి అని వ్రాయబడిన పదమునకు, ప్రకటీకరణము 22:17 వ. లోని "ఇచ్ఛగలవాడు జీవజలము ఉచితముగా పుచ్చుకొనుగాక" అను క్రియలాటి కర్తరిర్థక భావముకలిగియున్నది. గలతీయులకు వ్రాసినఉత్తరమునందు, పరిశుద్ధాత్మను విశ్వాసముద్వారా పొందుటను గురించి రెండుసార్లు వ్రాయబడియున్నది. "బోధనప్రమాణ క్రియలవల్ల ఆత్మను పొందితిరా? (3:2) ఆత్మనుగూర్చిన వాగ్దత్తము విశ్వాసమువల్ల మనము పొందుటకు (3:14) ఈవచనములవల్ల, రక్షణకొరకు ప్రభువైనయేసుక్రీస్తును ఏలాగున విశ్వసించవలెనో ఆలాగే శక్తికొరకున్ను మనలను మనము సమర్పించుకొనుట కొరకున్ను మనము పరిశుద్ధాత్మయందు విశ్వసింపవలెనని తెలియవచ్చుచున్నది.

మనము క్రొత్తనిబంధనబడికె బోధనువిడిచి, క్రొత్తనిబంధనబడికె మాదిరిని చూచినట్లయితే, పైనవివరింపబడిన భావము స్థిరపడును అపోస్తలుల కార్యములు 19-దో అధ్యాయములో నుండునట్టి అస్పష్టమైనసంగతిలో ఆరంభింతము. పౌలు ఎఫెసుకువచ్చి కొందరు శిష్యులను కనుగొని "మీరు విశ్వసించినప్పుడు పరిశుద్ధాత్మను పొందితిరా?

అనివారిని అడిగెను. అందుకువారు పరిశుద్ధాత్మ ఉన్నదనేసంగతి మేము విననేలేదనిచెప్పిరి" ఈ వాక్యమువల్ల ఒకడు క్రీస్తుశిష్యుడై యుండిన్ని, విశ్వాసులకు వాగ్దత్తముచేయబడిన దేవునివరమునుపొంద కనే ఉండుట సాధ్యమని స్పష్టముగా చూచుచున్నాము. కొందరు ఇదిసత్యమని ఒప్పుకొందురుగాని పౌలు ఆశిష్యులమీద చేతులుఉంచిన ప్పుడు వారు అన్యభాషలలో మాట్లాడుచు ప్రవచించుచుండిరని" వ్రా యబడియున్నది గనుక ఈవరము అద్భుతములుచేయుటకు తత్కాలము నకుమాత్రము ఇయ్యబడెననియు, మనకాలములయందు అట్టిఅద్భుతము లు జరగిడములేదు గనుక ఆవరము మనముపొందవలెనని దైవనిర్ణయ ములేదనియు వారు వాదింతురు- అయితే ఎఫెసీ క్రైస్తవులు తాము పరిశుద్ధాత్మవరమును పొందినతర్వాత నాయిరువై సంవత్సర ములకుముందు పరిశుద్ధాత్మచేత నింపబడిన, మేడగదిశిష్యుల అనుభవ మునకు (స్థితికి) వచ్చిరి. ఆశిష్యులుపరిశుద్ధాత్మతోనిండుకొని, ఆయాత్మ వారికి ఉచ్చారణశక్తి కలిగించినప్రకారముగా అన్యభాషలతో మా ట్లాడుటకు మొదలుబెట్టిరి" అనివ్రాయబడియున్నది. అ.కా. 2:4 ఈ ఎఫెసీ శిష్యులుకూడా, తాము పరిశుద్ధాత్మనుపొందినప్పుడు, అపోస్త లులకాలమందలి తక్కినశిష్యులకు ఉండినటువంటి గురుతులనే కనపర చిరి.

ఈ గురుతులు, అనగా భాషలతో మాట్లాడుట అద్భుతములు చేయుట- శాశ్వతముగానుండునవో కావో అను సంగతినిగురించి ఇ ప్పుడు మేమువాదించడములేదు. అయితే పరిశుద్ధాత్మఅనే దైవపురు షుడు సంఘమునందు శాశ్వతముగా నుండవలెననుటయందు సందేహ మేమియులేదు. విశ్వాసులకును పరిశుద్ధాత్మకును ఆ కాలమునందు ఏలాటిసంబధము కలిగియుండెనో, ఇప్పుడును ఆసంబధమును కలిగియుం డుటకు వారికిహక్కుఉన్నది. అపోస్తులుల కాలమందుండిన నీళ్ళ బా ప్తిస్మము ఈకాలమునందును అవశ్యముగా నుండవలెననియు, పరిశు ద్ధాత్మ బాప్తిస్మముమాత్రము ఆకాలమునందే సమసిపోయినదనియు బోధించుసిద్ధాంతము అసంగతము గనుక, మేము ఆసిద్ధాంతమునకు

ఎంతమాత్రము సమ్మతించము. పెంతెకోస్తు సర్వకాలమునకు ఒక్క సారిమాత్రము ఇయ్యబడెననియు, అయితే పరిశుద్ధాత్మచేత నింపబడుట అన్నికాలములయందలి అందరు విశ్వాసులు పొందవలసిన వరమనియు, మేముబోధించుచున్నాము; పరిశుద్ధాత్మయొక్క కొన్ని ఆశీర్వాదములు అపోస్తులుల కాలమునకుమాత్రము చెల్లునవని బోధించడమువల్ల కొన్ని ఊహింపబడిన సంకటములనుంచి మనము తప్పించుకొనినను, విశ్వాసులకు చెందవలసినవారి మిక్కిలి అమూల్యమైన నిబంధనహక్కులలో కొన్నిటిని వారికిలభించకుండా జేయుటకు కారణముకావచ్చును. ఎపేసీ క్రైస్తవులనుగురించిన ఈసంగతినిఈలాగున విడిచిపెట్టిమనకాలమునందలి క్రైస్తవుల ఆత్మీయ స్థితినిగురించి విచారింతము. మనము ఈవిషయమై ఎవరినిగురించియైనా ఊహించి దృష్టాంతముగా తీసికొనిరానక్కరలేదు. ఎందుకనగా, పరిశుద్ధాత్మ ఒకప్రభావముఅనియు పురుషవిహీనమైన వస్తువు అనియు గాక పరిశుద్ధాత్మ దైవపురుషుడై యున్నాడని ఎరుగనంత అపూర్ణముగా నేర్పబడిన క్రైస్తవులు ఒక్కొక్కరుగామాత్రమే కాకుండ సంఘ సంఘములుగానున్నారు, పరిశుద్ధాత్మ దైవపురుషుడై సంఘములో నివసించుచున్నాడనియు ఆయనను ఘనపరచి ఆయనకు ప్రార్థించవలెననియు ఆయనకు విధేయులమై పూర్ణముగా ఆయనను నమ్ముకొనవలెననియు వారికి ఏమియు తెలియదు ఈలాటిసంఘములయందు లోతైనఆత్మీయజీవముగాని సేవకొరకు పరిశుద్ధపరచబడిన ఆశక్తిగాని ఉండగలదని ఏలాగునచెప్పగలము? ఇట్టిస్థితియందుండిన సంఘమునుగాని క్రైస్తవునిగాని చూచినప్పుడుబాగానేర్పుపొందిన బోధకుడు లేక సువార్తికుడు ఏమిచేయవలెను? ఇందుకు ప్రత్యుత్తరము అపోస్తలులకార్యములో మరియొకచోట ఉన్నది. "సమరయ్య వారు దేవునివాక్యము నంగీకరించిరని యెరుషలేములోని అపోసలులువిని పేతురును యోహానును వారియొద్దకు పంపిరి. వీరు వచ్చి వారుపరిశుద్ధాత్మను పొందేనిమిత్తము వారికొరకు ప్రార్థించిరి. అంతకుముందు వారిలో ఎవనిమీదను అదివాలియుండలేదు. ప్రభువైన యేసు నామములోనికి మాత్రము వారు ముంచబడియుండిరి. అయితే

వారిమీాద చేతులుఉంచినప్పుడు వారుపరిశుద్ధాత్మను పొందిరి" (అ. కా. 8:14-17).

ఈ విశ్వాసులు అదివరకు నీళ్ళలో ముంచబడియుండిరి. అది చాలదు. పెంతికోస్తునందు కుమ్మరింపబడిన పరిశుద్ధాత్మ ముంచడ మును వారు పొందవలసియుండెను. అపోస్తులులు "వారు పరిశుద్ధాత్మను పొందేనిమిత్తము వారికొరకు ప్రార్థించిరి" అనేసంగతిని మనము కనిపెట్టవలెను. అలాటిప్రార్థన పరిశుద్ధాత్మ అనే ఆదరణకర్తనుఎరుగని వారుజేయుట అత్యావశ్యకము. అలాగు ప్రార్థనచేయువారు పరిశుద్ధాత్మకు మనఃపూర్వకముగా విశ్వాసముతో తమ్మునుతాము అప్పగించుకోవలెను. ఓపరిశుద్ధాత్మా! నన్ను నేను నీచిత్తమునకు వినయముగా అప్పగించుకొనుచున్నాను. నేను నిన్ను నాబోధకునిగా, నాఆదరణకర్తగా, నన్ను పరిశుద్ధపరచువానిగా నామార్గదర్శిగా నంగీకరించుచున్నాను. పాపక్షమాపణనుపొంది పరిశుద్ధాత్మశక్తిని పొందకుండా ఉండి తర్వాత తమ్మునతాము సంపూర్ణముగా అప్పగించుకొనిన తర్వాత సమాధానము, శక్తితోను, విజయముతోను నిండుకొనినవారు అనేకులు ఉన్నారుగదా? మనము దేవుని సంఘమునందు మిక్కిలి ప్రయోజనకరమైనటువంటిన్ని సఫలకరమైనటువంటిన్ని సేవజరిగింపవలెనను గొప్పఉద్దేశముతో పరిశుద్ధాత్మవరము మనకు ఇయ్యబడుచున్నది. మనము ఈ వరమును పొందినతర్వాత మనకు ఇతర ఆశీర్వాదములు కూడా కలుగును. అనగా మనము క్రీస్తునందు ఉన్నామని మనకు స్థిరమైన నిశ్చయతకలుగును; లోకముయొక్క అపవిత్రతనుంచి ప్రత్యేకింపబడి పరిశుద్ధపరచబడుదుము. ఇవి మనగొప్పముఖ్యమైన ఉద్దేశమును అనగా మనము ప్రయోజనకరమైన సేవజేయుటకుగాను మనకు సహాయపడును.

మనమాదిరియైన క్రీస్తు అన్నివిషయములందువలెనే ఈవిషయమందుకూడా తాను పరిశుద్ధాత్మను పొందకమునుపు తన సునార్తసేవమీాద బైలువెళ్లలేదు అని మనము కనిపెట్టవలెను. అంతియేకాదు. ఆయన ముంచడము మొదలుకొని ఆరోహణమువరకు ఆయన

చేసిన సేవయంతయు పరిశుద్ధాత్మయందు చేయబడెను. ఆయన అద్భుతములను గురించి మనము ఆయనను అడిగితే "నేను దేవునిఆత్మవల్ల దయ్యములను వెళ్ళగొట్టితిని అని ఆయనచెప్పుట మనము విందుము (మత్తయి 12:28) ఆయన యెరూషలేములో నెరవేర్చిన తనమరణమును గురించి మనము ఆయనను అడిగితే శాశ్వతమైన ఆత్మద్వారా తన్ను దేవునికిమచ్చలేని వానిగా అర్పించెను" అని మనము చదువుదుము (హెబ్రి 9:14) ఆఖరి గొప్పఆజ్ఞ ఇవ్వడమును గురించి మనము అడిగితే ఆయన తానుఏర్పరచుకొనిన అపోస్తలులకు పరిశుద్ధాత్మవల్ల ఆజ్ఞాపించెను. అని మనము చూడగలము (అ.కా. 1:2). ఆయన దేవునికుమారుడైయుండియు, ఆయన ఎల్లప్పుడును దైవత్రిత్వమునందు కార్యకర్తయైన పరిశుద్ధాత్మకు లోబడియుండెను. పరిశుద్ధాత్మ విషయమై క్రీస్తుఏలాగున మనకు మాదిరియైయుండెనో మనముస్పష్టముగా చూచుచున్నాము. ఆయన కన్యకగర్భమునందు పరిశుద్ధాత్మవల్ల జన్మించెను; ఈ దైవజన్మమునకు తగినట్లుగా ఆయన దైవజన్మమునకు విధేయతతో లోబడి నడుచుకొనుచుండెను. అయితే ఆయన తన బహిరంగమైన సేవలో ప్రవేశించనై యుండినప్పుడు, పరిశుద్ధాత్మ ఆయనమీదికి వచ్చుటకు ఆయన కనిపెట్టుకొనియుండెను. ఈపరిశుద్ధాత్మ ఇంతకుముందు ఈయనయందుండెను. ఈయభిషేకము కొరకు ఆయన ,, ప్రార్థించుచుండగా ఆకాశము తెరవబడెను. అప్పుడు పరిశుద్ధాత్మ దేహాకారముగా పావురమువలె ఆయనమీదికి దిగివచ్చెను. (లూకా 3:22) ఆయన పరిశుద్ధాత్మకొరకు ప్రార్థించెనని మనము నమ్ముటకు ఆయనకు తండ్రియొక్క వాగ్దత్తము" ఏమైనాఉండెనా? అప్పుడు యెష్షయి అను మొద్దునుంచి వచ్చే కర్రనుగురించి వ్రాయబడియుండెను. ,, యెహోవా ఆత్మఅనగా, జ్ఞానవివేకములుగల ఆత్మయు, ఆలోచనశక్తులుగల ఆత్మయు, యెహోవాభయభక్తివిద్యలు గల ఆత్మయు, ఆయనమీద నిలుచును" (యెషయా 11:2) ఇది ఏడురెట్లఆత్మనుగురించిన వాగ్దత్తమని యూదీయవ్యాఖ్యానకర్తలు చెప్పుదురు. యోర్దానునొద్ద ఈవాగ్దత్తము దేవుని కుమారునిమీద శబ్దార్థముగా నెరవేర్చబడెను. దేవుడు

ఆయనకు అప్పుడు పరిశుద్ధాత్మను కొలతలేకుండా ఇచ్చెను. ఎందుకన
గా ఇప్పుడు బాప్తిస్మము పొందిన యేసుతానే తిరుగాబాప్తిస్మ మి
య్యవలసినవాడై యుండెను. "ఎవనిమీద ఆత్మదిగినిలుచుట నీవుచూ
తువో, ఆయనే పరిశుద్ధాత్మలో ముంచుచున్నవాడని నాతో చెప్పెను"
(యోహాను 1:33) నేను మారుమనస్సు విషయమై మిమ్మును నీళ్ళలో
ముంచుచున్నాను గాని నావెనక వచ్చుచున్నవాడు నాకంటె శక్తిమం
తుడు. ఆయన పరిశుద్ధాత్మలోను అగ్నిలోను మిమ్మును ముంచును.
(మత్తయి 3:11) ఇప్పుడు ఆయన దేవునికుడిచేతియందు హెచ్చించబ
డి, పరిశుద్ధాత్మయొక్క పరిపూర్ణతయైన ఏడుఆత్మలుగలవాడై ప్రత్య
క్షి (3:3) తండ్రి ఆయనమీద దానిని కుమ్మరించినలాగున దానికొరకు
ప్రార్థించేవారిమీదికి ఆయన (అనగాక్రీస్తు) తనశక్తినిపంపును.

పరిశుద్ధాత్మశక్తిని కలిగించడమును గురించి ప్రయోగింపబడి
యున్న గురుతులను వివరణలును ఇప్పుడు చూతము. ఇవిక్రీస్తుకున్ను
క్రీస్తుశిష్యులకున్ను సమానముగా నుపయోగింపబడియున్నవి. 1 పరి
**శుద్ధాత్మయొక్క ముద్ర.** రొట్టెలకు చేపలకుగాను ఆయనను వెతుకు
చుండిన జనసమూహములతో యేసు ఈమాటలు చెప్పెను. మనుష్య
కుమారుడు మీకు యిచ్చే నిత్యజీవమునకు నిలుచు ఆహారముకొరకే
గాని, నశించు ఆహారముకొరకు కష్టపడకుడి. ఎందుకనగా తండ్రి అన
గా దేవుడు ఆయనకు ముద్రవేసెనని చెప్పెను." యోహాను 6:27 ఈ
ముద్రవేయుడము, యోర్దానునొద్ద ఆయన పరిశుద్ధాత్మను పొందుట
యని సందేహమేమియు లేదు. బలిసర్పించుటకు ఒకగొర్రెపిల్లను మం
దలోనుంచి ఏర్పరచి, దేవాలయమునొద్దకు దానితెచ్చినప్పుడు, దాని
లో ఏమైనా మర్దకగాని మచ్చగాని ఉన్నదేమోనని మొదటయాజకుడు
పరీక్షించి అది నిష్కళంకమైనదై యున్నయెడల, అదిఅర్పణకు తగిన
దియని తెలియబడుటకు దేవాలయముయొక్క ముద్రి దానిమీదవే
యునని. హెబ్రీయుల ఆరాధనలు, ఆచారములను గురించి వ్రాసిన ఒక
గ్రంథకర్త చెప్పుచున్నాడు. అలాగే, ఇదిగో దేవునియొక్క గొర్రెపిల్ల
తన్ను తాను యోర్దానునొద్దపరీక్షకు అప్పగించుకొంటున్నాడు. దేవు

నియొక్క సర్వజ్ఞమైన పరీక్షయందు, ఈయన, ,,మచ్చయైనా మడత యైనా లేనట్టి నిష్కళంకమైన గొఱ్ఱెపిల్ల"గా కనుగొనబడెను. తెరవబడిన ఆకాశమునుంచి, ఈసంగతిని గూర్చి దేవుడు ,,ఈయనే నాప్రియ కుమారుడు; ఈయనయందు నాకిష్టముకలదు" అనే సాక్ష్యమిచ్చిన తర్వాత కుమారస్థితికి తగినసాక్ష్యముగాను బలికి సేవకు ఆయన ప్రత్యేకింపబడిన దానికిముద్రగాను పరిశుద్ధాత్మను ఆయనమీాదికి పంపించెను.

ఈయనుభవమందు శిష్యుడును ప్రభువువలెనున్నాడు. ,,మీారు ఆయనయందు విశ్వాసముంచి, వాగ్దత్తముచేయబడిన పరిశుద్ధాత్మతో ముద్రించబడితిరి. (ఎఫేసీ 1:13) లేఖనములయందు ఎల్లప్పుడును, ఈ కార్యము విశ్వాసమున కనంతరము జరుగునని తెలియజేయబడి యున్నది. అది మారుమనస్సుకాదు. మారుమనస్సు పొందినవానియందు జరుగుకార్యము, అతని విశ్వాసము మీాదఉంచబడిన సమర్పణఅనే కిరీటమువంటిది.

ఈరెండుకార్యములును భేదమైనవి. మారుమనస్సునందు విశ్వాసి దేవునిసాక్ష్యమును పొందును. అందువల్ల అతడు దేవుడు సత్యవంతుడని ముద్రవేసియున్నాడు. యోహాను 3:33 విశ్వాసి తన్నుతాను సమర్పించుకొనుటయందు అతడు సత్యవంతుడని ముద్రవేసియున్నాడు. ఇది క్రైస్తవుడు దేవునితో సత్యమనిచెప్పిన దానిని దేవుడు క్రైస్తవునితో సత్యమని చెప్పి ఖాయపరచుటయై యున్నది. మీాతో కూడా మమ్ము క్రీస్తుయందు స్థిరపరుచుచు, మమ్మును అభిషేకించినవాడు దేవుడే, మరియు ఆయన మనకు ముద్రవేసి, మనహృదయములలో మనకు పరిశుద్ధాత్మఅనే సంచకరువును ఇచ్చియున్నాడు." (2 కొరింతి 1:21,22)

ఈదైవకార్యమువల్ల మనము ఏలాటిస్థితికి అప్పగించబడి ప్రత్యేకింపబడి యున్నామని విచారించితే, కాపరిఉత్తరములలో ఒకదానియందలి ఒకమర్మమైన వాక్యమునందు దీనిభావము, సూచింపబడియున్నది. కొందరిలో కొన్నిలోపములు అవిశ్వాసము ఉండినప్పటికిన్ని ,,ఈముద్రకలిగి, దేవునియొక్క స్థిరమైనపునాది నిలుకడగానున్నది"

(2 తిమోతెయు 2:19) తర్వాత ఆముద్రమీదనుండు రెండువ్రాతలను
ఆయన మనకు చూపించుచున్నాడు. (1) ప్రభువుతనవారిని ఎరుగును.
(2) ప్రభువుయొక్క పేరునుఒప్పుకొనే ప్రతివాడును దుర్ణీతినిత్యజించ
వలెను. మొదటిది హక్కునుగురించిన్ని రెండవది పరిశుద్ధతనుగురించి
న్ని సూచించును. మనము పరిశుద్ధాత్మవరమును పొందునపుడు మన
ము అప్పటినుంచి పరిపూర్ణముగా ఆయన వారమనిఎంచబడుటకే, ఎ
ట్లు ఎవడైనను సమర్పించుకొనకపోతే, వానికి ఆత్మీయపరిపూర్ణత ఏ
లాగునకలుగును? దేవుడు తనదికాని దానిమీద తనముద్ర వేయడు.
కాబట్టి లోకమనస్సుయొక్క శక్తివల్ల మనము దేవునినుంచి దూరమై
మనస్వకీయచిత్తమునకు మనలను మనము అప్పగించుకొంటే దేవుడు
కూడా మనలను ఎడబాసి, మనము ఆయనస్వంతవారమనే ముద్ర ఆ
యన మనమీదవేయడు. ఎవరైతే ఆయన సేవకొరకు పరిపూర్ణము
గాను తిరుగులేకుండాను తమ్మతాము అప్పగించుకొందురో, వారికి ఆ
యన తనపరిశుద్ధాత్మను ఎంతోకృపతో యిచ్చును. అయితే ఆయన
నామము పేరటపిలువబడుచు నానాఆశలయందును భోగములయందు
ను ఉండేవారికి ఆయన తన పరిశుద్ధాత్మవరమును ఎంతమాత్రమును
ఇయ్యడు. వారినుంచి ఆయన దాసిని తనశౌర్యమంతటితో బిగబట్టు
కొనును. ఈభావమును చూపించుటకుగాను యోహాను 2:23-24 ల
లోనుండే విరుద్ధమును ఈలాగున భాషాంతరము చేయవచ్చును. అదిఏ
దనగా „ఆయనచేసిన గురుతులుచూచి అనేకులు ఆయన నామమందు
నమ్మికొనిరి, గాని యేసుతన్ను వారిని నమ్మలేదు.'' యోహాను2:23
24 పరిశుద్ధాత్మ ముద్రకలిగియుండుటకు ఇదిముఖ్యమైన షరతు. ప్రభు
వు మనలను నమ్మగలడా? ఇదికాదు గాని ఇంతకంటె లోతైనప్రశ్న
ను మనము అడుగవలెను. అనగా ఆయన తన్ను మనకు అప్పగించగ
లడా? ఆయన తనముద్ర ఉంగరమైన పరిశుద్ధాత్మను మనప్రార్థనలమీ
దను మనమీదను ముద్రవేసికొనుటకున్ను ఆయనఘనతకు లోపము
రానియ్యకుండ జేయుటకున్ను ఆయన మనకు అప్పగించునా?

ముద్రమీదనుండే మరియొకవ్రాత ఏమనగా „ప్రభువుయొక్క

పేరునుబప్పుకొనే ప్రతివాడును దుర్ణీతినిత్యజించవలెను." మనము పరిశుద్ధాత్మను పొందుటవల్ల మనము పాపమునుంచి బొత్తుగా ప్రత్యేకింపబడియుండునట్లు చేయబడుదుము. ఎందుకనగా పరిశుద్ధత, మనలో నివసించునట్టి పరిశుద్ధఆత్మయొక్క ప్రసరణముగాక మరియేమి? కాబట్టి పరిశుద్ధమైన బ్రతుకు అనగా ఆయనముద్రయొక్క అచ్చుమాత్రమే" పరిశుద్ధతయొక్క ముద్రమైన ఆయన గురుతు లేనిది ఆయన మనలను తనవారని ఎన్నటికిన్ని చెప్పజాలడు. సైతానుముద్ర దేవునిగురుతై ఎంతమాత్రము ఉండనేరదు. మనము అంతప్రసిద్ధమైన దైవజన్మమునకు తగినట్టియు, మనగొప్ప పరమతండ్రి ఘనతకుతగినట్టియు కార్యములను మనము చేయుచుంటేనే తప్ప, మనము ఆయననుంచి ఆత్మీయముగా జన్మించినామనేది నట్టిబూటకమే" ఈప్రస్తుతఏర్పాటునందు పరిశుద్ధాత్మయొక్క గొప్పపని క్రీస్తును తనదేహమైన సంఘమునకు సంయోగపరచుటయై యుండును. యేసుక్రీస్తుయందు పరిశుద్ధతకన్న ప్రధానమైనది మరిఏమైనా ఉన్నదా? ఆయనయందు పాపములేదు. ఆయనయందు నిలుచు ప్రతివాడును పాపముచేయడు." దేహము శిరస్సుతో ఎడతెగని అన్యోన్యసంబంధము కలిగియుండుటవల్లనే పాపరహితముగా నుండగలదు. ఈశిరస్సు, తనదేహము పరిశుద్ధముగానుంటేనే గాని దానితో అన్యోన్యముగా నుండదు.

ఇంతకుముందుగానే మనము యోచింపుచుండిన స్వాతంత్రమును గురించి, అపోస్తలుని మాటలయందు ఇంకాపూర్ణముగా వివరింపబడియున్నది. (ఎఫెసీ 4:30) పరిశుద్ధాత్మను దుఃఖపరచకుడి, మీరు ఆయనయందు విమోచన దినముమట్టుకు ముద్రింపబడియున్నారు."

మనప్రభువు మహిమతో వచ్చుదినము విమోచనదినము. ఆయన అప్పుడు చనిపోయినవారిని లేపి, జీవించియున్నవారిని మార్చును. ఇప్పుడు ఆయన స్వకీయులు ఈలోకమందు ఉన్నారుగాని, లోకమువారిని తెలుసుకొనలేదు. అయితే ఆయన వారిమీద తనముద్రను తనరహస్యమైన గురుతును వేసియున్నాడు గనుక అందువల్ల ఆయనవారిని తన రాకడకాలమునందు గుర్తించును. మన రక్షకునియొక్క రెండవ

రాకడయప్పుడు, ఆగొప్ప జీవింపజేయుకాలమునందు పరిశుద్ధాత్మ ము
ద్రవల్లనే పరిశుద్ధులు ముద్రింపబడుదురు. పరిశుద్ధాత్మ శక్తివల్లనే వా
రు దేవునియొద్దకి కొంచుపోబడుదురు. యేసును లేపినవానియొక్క ఆ
త్మ మీలోనుంటే" అనేది ఆఖరిపునగుత్థాన జీవమునకు ముఖ్యమైనష
రతు. సూదంటురాయి మొదటదాని ఆకర్షణశక్తిని ఇనుపముక్కలలో
కి వ్యాపింపజేసి తర్వాత వాటిని తనతట్టుకులాగుకొను ప్రకారము యే
సుకూడా మొదట తన పరిశుద్ధాత్మను తనస్వకీయులకిచ్చి, ఆపరిశుద్ధా
త్మవల్లనే ఆయన వారిని తనయొద్దకులాగుకొనును, నిత్యజీవమును క
లిగియుండే వారందరును, శరీరవిమోచనమునందు పాలుపుచ్చుకొందుర
నే సంగతిని గురించి మేము ఇప్పుడు ప్రశ్నించడములేదు. పరిశుద్ధాత్మ
ను దుఃఖపరచుట కూడదని అపోస్తలుడు ప్రేరేపించు దానినిగురించి
మాత్రము మేము ఇప్పుడు చెప్పుచున్నాము. మనము ముద్రింపబడిన
ముద్రను మనము చెరిపివేయకుండునట్లును విమోచనదినమునందు మన
ను సూచించవలసిన ముద్రను మనము చెరిపివేయకుండునట్లును మన
ము భయపడవలెను.

Foot Note not translated.

ముద్ర అనగా ఒకమాటలో పరిశుద్ధాత్మమాత్రమే ఇప్పుడు ఆ
పరిశుద్ధాత్మను విశ్వాసమువల్ల అంగీకరించిన వారియందు ఆయన నివ
సించుచున్నాడు. పరిశుద్ధాత్ముడు మనలోనుండి పలుటవల్ల మనలో ని
శ్చయత సంతోషము సేవకొరకు శక్తిపొందుదుము. ఈసంగతి విష
యమై మీకు తెలిసినవారందరిలో డాక్టరు జాక్ ఓవెన్ అనేఆయన
ఎక్కువజ్ఞానముగాను విస్తీర్ణముగాను వ్రాసియున్నాడు. క్రీస్తుఏలాగున
ముద్రింపబడెనో మనము ఎరిగియుంటే మనము ముద్రింపబడిన విధము
ను గ్రహింపగలము. తండ్రివల్ల క్రీస్తుముద్రింపబడుట యనగా, పరిశు
ద్ధాత్మను క్రీస్తుపరిపూర్ణముగా పొందుటయే. ఈపరిశుద్ధాత్మయే, యే
సును తన కార్యములన్నిటియందు నడిపించుచుండెను; ఆయన తనఫలక
లకార్యములు జరిగించుటకు అధికారమిచ్చుచుండెను. ఇందువల్ల దేవు
డు ఆయనలోకూడా ఉండి, ఆయనయందు ఇష్టపడియుండెనని అగుప

డుచున్నది. అలాగే దేవుడు విశ్వాసులను ముద్రవేయుట వారుపిలువబడిన పరిశుద్ధమైన పిలుపుకు తగియుండునట్లు వారికిశక్తి కలిగించి వారి కొరకున్నూ ఇతరులకొరకును ఆయనయెదుట వారంగీకరించబడునట్లును నిత్యజీవమునకు వారు కాపాడబడుదురని రూఢిపర్చుచు తనదైవశక్తి ని వారిలో ఉంచునంతమట్టుకు పరిశుద్ధాత్మని వారికిదయచేయును.

2. ఆత్మయొక్క నిండుతనము యేసుబాప్తిస్మము పొందినవెంటనే "యేసుపరిశుద్ధాత్మ పూర్ణుడై యోర్దానునదినుండి తిరిగివచ్చి ఆత్మచేత నరణ్యమునకుకొనిపోబడి (లూకా 4:1) అని ఉన్నది. ఆత్మవాలినవెంటనే శిష్యులుమేడగదిలో కూడుకొనియుండినశిష్యులనుగూర్చిఇట్లు వ్రాయబడియున్నది. "వారందరు పరిశుద్ధాత్మతో నిండినవారై (అపొ 2:4) ఇక్కడ చెప్పబడినది లేఖనములలో యితరచోట్ల చెప్పబడిన ఆత్మనుపొందుటయునుదానికి భేదమైనది కాదు. అది తిరిగితిరిగిజరుగవలసినకార్యమే. మనము ఆత్మయందు నివసించుచుండిన యెడల అట్లుజరుగును. అయితే అదియింతకుమునుపేమారుమనమనస్సుపొందినవానికిగల అనుభవము. ఇదిపౌలుజీవితములో తేటగా కనబడుచున్నది. ఈఅధ్యాయముయొక్క ప్రారంభభాగములో యెత్తివ్రాయబడిన అభిప్రాయము ప్రకారము ఆత్మనుపొందుట మారుమనస్సుతో యెల్లప్పుడును ప్రత్యేకముకాకుండను సంబంధించినదైతే రాష్ట్రీకుల అపొస్తలునికి అంతచక్కగాను అంత తేటగానుకలిగిన మారుమనస్సుకు పిమ్మట అపొ 9:17 లో చెప్పబడిన "అననీయవెళ్ళి ఆయింట ప్రవేశించి యతనిమీద హస్తనిక్షేపణముచేసి సౌలాసహోదరుడా నీవువచ్చినమార్గములో నీకుకనబడిన ప్రభువైనయేసు నీవుదృష్టిపొంది పరిశుద్ధాత్మతో నింపబడునట్లు నన్ను పంపియున్నాడని చెప్పెను" అపొ 9:17 అనునది యెందుకు రావలెను అని యెవరైనను సహేతుకముగా అడగవచ్చును. సిద్ధాంతములోను జీవములోను, లేఖనములలో అంతతరచుగా కనబడే దానిగూర్చి యిక్కడ చెప్పబడియున్నది. అది మారుమనస్సునకును ఆత్మనుపొందుట అని మేము చెప్పినతర్వాతదానికిని ప్రత్యేకమైన దైవసంబంధమైన ఏదోఒకటైయున్నది. దీనిని "శక్తిని కలిగించుట అనిచె

ప్పాట తెగియున్నది. ఏలయనగా ఈయోగ్యతతో బలమైనక్రియలును బలమైన వాక్శక్తులును అపొస్తలుల కార్యముల గ్రంథములో ఎంత తరచుగా సంబంధించియున్నవో గమనించుము. "పేతురు పరిశుద్ధాత్మతో నిండినవాడై యిట్లనెను. (అపొ 4:18) అని అతనియొక్క మిగుల బలమైన ప్రసంగములకు పీఠిక ఉన్నది. "అప్పుడు వారందరు పరిశుద్ధాత్మతో నిండినవారై దేవునివాక్యమును ధైర్యముగా బోధించిరి" అని ఇంకొకచోట (అపొ 4:31) వ్రాయబడియున్నది. అపొ 6:5 లోని పరిచారకుల నేర్పరచుకొనుటలో విశ్వాసముతోను పరిశుద్ధాత్మతోను నిండుకొనినవాడైన స్తెఫనను వారుఏర్పరచుకొనిరని ఉన్నది. "అతడు పరిశుద్ధాత్మతో నిండుకొనిన వాడైనందున" అనునది అతడిచ్చిన హతసాక్ష్యపు ప్రసంగమునకు తాళపుచెవివంటిదిగా నున్నది. ఇప్పుడు మేము చెప్పిన అపొస్తలుని మారుమనసునుగూర్చిన వృత్తాంతమును బట్టి చూస్తే ఆత్మయొక్క యీఅంతర్వ్యాసము క్రైస్తవజీవములో తీర్మానమైనట్టియు మిగుల ముఖ్యమైనట్టియు సమయమును గుర్తుపెట్టుచున్నది.

Printed by B. K. Swamy at the Vani Press, Bezwada.